# గజపతులనాటి గాథలు

రచన :

బులుసు వేంకటరమణయ్య

శ్రీ వేమన గ్రంధాలయమ్
తేలప్రోలు. (కృష్ణా జిల్లా)



—ప్రచురణ—

బుక్ మన్స్ : : మద్రాసు-7

2

మొదటి కూర్పు :
ఫిబ్రవరి 1955

## శ్రీ బులుసు వెంకటరమణయ్యగారు రచియించిన

# పదహారు రాత్రులు

ప్రేమించుట తెలియని రాజు, పంతముపట్టి కూర్చున్న సుందరి, నారీమణులను ద్వేషించే ఆ రాజును, చిత్రమైన ఒక సన్నివేశం వల్ల ఆ సుందరితో సమావేశం కలుగుతుంది. రాజపుత్రి షరతుప్రకారం, ప్రేమించుట తెలియని ఆ రాజుపక్షాన ఆయన మిత్రుడు ధీనిధి పూనుకొని, కఠినాతి కఠినమైన ఒక్కొక్క సమస్యను కథారూపంగా ఇచ్చి ఆమెను జవాబు చెప్పమంటాడు. అద్భుతమైన ఆ కథలను ఆ సుందరి విప్పి చెప్పకోగలుగుతుంది. చివరకు, రాజు ఆమెను గాంధర్వవిధిని పెండ్లాడి, తాను తెల్లగుఱ్ఱంమీదా, రాణి నల్లగుఱ్ఱంమీదా స్వారిచేసుకుంటూ, రాజధానికి మరలిపోతారు.

## ఈ పుస్తకములోని కథలు

చిత్రకారుడు : చిట్కావైద్యము
బ్రహ్మదేవుని సృష్టికథనము
1. చార్వాక-గణపతుల కథ
2. బాలరాజు కథ
3. బింబ-ప్రతిబింబుల కథ
4. సువర్ణమాల కథ
5. ముగ్గురురాణుల కథ
6. కపటసన్యాసి కథ
7. మనసులేని మనువు కథ
8. పరకాయప్రవేశము కథ
9. ఎండమావులునమ్మినవర్తకునికథ
10. ఎఱ్ఱపెదవుల రాక్షసి కథ
11. నాగరాజు పగబట్టిన కథ
12. పండ్లుతిన్న ఫలితము కథ
13. యమ-మన్మథుల కథ
14. కృతాకృతుని కథ
15. తేనెటీగ-ఎఱ్ఱతామర కథ
16. వలపు : గెలుపు

ఈ కథలు పదహారూ తేనెసోనలు, అమృత గుళికలు, చేతబట్టింది మొదలు ముగిస్తేకాని పుస్తకము విడువలేరనటం ఎంతమాత్రమూ అతిశయోక్తి కాదు. ముచ్చటగు ముద్రణ, అత్యంత ఆకర్షణీయమైన త్రివర్ణ ముఖచిత్రం.

# అభిప్రాయములు:

"పదారు రాత్రులు పదారు కథలు- పదారు సమాధానాలు. ప్రతి ప్రశ్నా జిజ్ఞాస రేపేదే. ప్రతి సమాధానమూ యుక్తియుక్తమైనదే. మళ్ళీ కథలో ఏమి ప్రశ్న వస్తుందో ఏమి సమాధానం వస్తుందో అన్న ఆతురత పాఠకులకు పట్టుకుంటుంది. ఈ వూపుతో, ఈ కైపుతో ఆపకుండా పుస్తకమంతా చదివేస్తారు.

చక్కని కథలు, చిక్కని శైలి, ఆద్యంతం మనోహరంగా వున్నది. ఇంత వలపు-తలపుల కథల్లోనూ ఒక్క అశ్లీలపదం గాని అసభ్యవర్ణనగాని మచ్చుకైనా కనిపించదు. ప్రేయసీ ప్రియుల నిరువురనూ బహు హద్దులో ఉంచారు గ్రంథకర్త.

ఆలోచనకు ఆలోచన, చమత్కారానికి చమత్కారము, విజ్ఞానానికి విజ్ఞానము, యుక్తికి యుక్తి, ఉపజ్ఞకు ఉపజ్ఞ, శైలికి శైలి, జిగికి జిగి, బిగికి బిగి — అన్నీ సమపాళ్ళుగా ఉండి, చదవడానికి బహు యోగ్యంగా ఆహ్లాదకరంగా ఉన్నదీ పుస్తకం."

—కనుపర్తి వరలక్ష్మమ్మ

... ... ... ...

ఈ గ్రంథాన్ని రసవత్తరమయిన వ్యవహారభాషలో, పండిత పామరజన హృదయంగమంగా సంతరించిన శ్రీ వేంకటరమణయ్యగారు ప్రథమశ్రేణికి చెందిన ప్రజాసాహిత్యప్రియులు. వీరి యీ గ్రంథంలోని శైలి హోరెత్తించే జలపాతం కాదు; చిఱుతరగలతో క్రమనాదం చేస్తూ ఉరకలు వేసే నిర్ఝరం—పదాల పొందిక, మాటల అమరిక కథాధోరణికి మెరుగిస్తూ, ఆబాలగోపాలం ఆనందాన్ని కలిగిస్తుంది. ఇలాంటి గ్రంథాలకు విశ్వవిద్యాలయాలవారుకూడా తగిన ప్రోత్సాహాన్ని ఇచ్చి ఆదరింతురుగాక!

—మాతృసేవ



## రచయిత

జననం: విశాఖజిల్లా విజయనగరం దరి రామతీర్థంలో, తేదీ24-12-1907. విద్యాభ్యాసం విజయనగరం సంస్కృత కళాశాలలో; కాశీ విశ్వవిద్యాలయంలో అలంకార పరిశోధన: 1930-32. పట్టాలు — సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ, P. O. L. చెన్నపురి కెల్లెట్ హైస్కూలులో ప్రధానాంధ్రాధ్యాపకులు. రచనలు: విజయవిలాస, పాండురంగ మాహాత్మ్య, శ్రీ కాళహస్తి మాహాత్మ్య, సారంగధర, బాలవ్యాకరణ, ప్రౌఢవ్యాకరణాలకు టీకలు. అనువాదములు: రసార్ణవ సుధాకర, కువలయానందసార, అభిషేక నాటకాలు, కథలు, నవలలు — పంచతంత్ర కథలు, అప్పటి ముచ్చటలు, చిత్తూరు దుర్గము, దీపకళికలు, పదహారు రాత్రులు, ఇందిరాదేవి.

## మనవి మాటలు:

*

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు జగమెరిగిన బ్రాహ్మణులు. ఉభయభాషల్లో (గ్రాంథిక, వ్యావహారిక భాషల్లో అని మా నిర్వచనం!) కూలంకష ప్రజ్ఞగలవారు. పూర్వ కావ్యకర్తల హృదయావిష్కరణ క్రియాదక్షతలో మేటులనిపించుకొన్న ప్రఖ్యాత వ్యాఖ్యాతలు. వైయాకరణాలంకారిక విద్యాలంకారులు. అభిషేక నాటకాది బహుకృతి నిర్మాతలు. పాడుకభాషను వన్నె పెట్టే 'పదహారు రాత్రులు' వంటి ఆదర్శ గద్య కావ్య కృతికర్తలు.

ప్రసిద్ధ పత్రికలలో 'రావు' పేరుతో వెలువడే వారి పసందైన కథలను చిరకాలంగా చదివి ఆనందిస్తూనే

వున్నాము. మేష్టారు రచియించిన పరిశోధక వ్యాసాలు, గ్రంథ విమర్శలు, కథలు-గాథలు చాలా ఉన్నాయి. అటువంటి చక్కటి కథలలో ఒక ప్రత్యేక-కోవకు చెందినవి—ఈ 'గజపతులనాటి గాథలు.'

'గజపతు' లనగానే ఇవి విజయనగరసంస్థానానికి సంబంధించిన కథలని వెంటనే స్ఫురిస్తుంది. మామూలు కథలైతే ఎన్నయినా ఎవరైనా అల్లవచ్చు. ఇవి కల్పిత కథలు కావు—వాస్తవిక సంఘటనలు. సంస్థానాల గురించిన ఇటువంటి కథలు మట్టుకు ఎవరు పడితే వారు వ్రాసేవి కావు. సన్నిహిత సంబంధం కలిగివున్నవారే ఈ ఆంతర్యాలను గ్రహించగలరు; వాటిని ఉన్నవి ఉన్నట్లు చిత్రించగలరు.

రమణయ్యమేష్టారు విజయనగర ప్రాంతంవారే. వారికి రూఢిగా తెలిసినవాటినే గాక, సంస్థాన సంబంధం గల శ్రీ కొంపెల్ల విశ్వనాథశాస్త్రి, పాకలూరి దశరథ రామయ్య ప్రభృతులవల్ల ప్రస్తావనగా తెలుసుకొన్న గాథలనుకూడా పేర్చి కూర్చారు. వారు సంతరించిన గాథలలో ఇవి కొన్నిమాత్రమే. తక్కినవిన్నీ త్వరలోనే ప్రకటించాలని కుతూహలంతో ఉన్నాము.

—బుక్ మన్స్



# విషయానుక్రమణిక







# గజపతులనాటి గాథలు

* * *

## 1. యుక్తి

ఇది రెండువందల ఏళ్ళ కిందటి మాట.

విజయనగరం సంస్థానం దివాను పూసపాటి సీతారామరాజుగారు కోటలోని మోతీమహల్లో కచేరి చేస్తూ వున్నారు.

దివానుగారంటే అందరికీ భయమే! ఎంతో పరిచయం వున్నవాళ్ళు తప్ప ఎవ్వరూ ఆయనయెదట పడలేరు. ఆయన ఆహ్వానించనిదీ ఎవ్వరూ ఎదటికి రాకూడదు. ఆయనది సుగ్రీవాజ్ఞ! మహారాజులుఁగారు కూడా ఒక్కొక్కప్పుడు తనకు యిష్టంలేని పనులు జరిగినప్పటికీ పూరుకోవలసినదే!

దివానుగారికి అంత స్వాతంత్ర్యం వుంది. ఆయన మహారాజులుంగారి సవతి అన్నగారు!

అప్పుడు ప్రభువుల ఆస్థానకవి - అడిదం సూరకవి- దివానుగారి దర్శనానికి వచ్చాడు. అతనిని లోపలికి రప్పించి, కూర్చున్నాక దివాను "కవిగారికి నమస్కారం! ఏం యిలా దయచేశారు? ప్రభువులు వూళ్ళో లేరని తెలియదేమో?" అన్నాడు.

"తెలిసిందండి. నిన్న మధ్యాహ్నం వేట నిమిత్తం మహారాజులుంగారు పికారుగంజికి వేంచేసినట్లు తెలిసింది. వారు లేకపోతే నేమీ? ప్రభువులంతవారు తమరు! తమ దర్శనానికే వచ్చాను నేను" అన్నాడు సూరకవి.

"అయితే సరే! చాలా సంతోషం! ఎప్పుడూ రాని వారు వచ్చారు, ఏమిటి సెలవు?"

"మరేమీ విశేషమైన పని కాదండి! ప్రభువులవారు మాకు యిదివరలో రెండు మాన్యాలు యిప్పించారు! మా కర్మం ఏమిటో గాని, అవి యెప్పుడూ యెండడమే కాని, పండడమనే మాట లేదు. పై పెచ్చు మేం గంటాల పన్ను చెల్లించుకోవలసి వస్తున్నాది. దయయుంచి వాటికి బదులుగా మరేమయినా కటాక్షిస్తే బ్రతికిపోతాము. ఏలినవారికి పుణ్యమూ వుంటుంది."

"ఓహో! మీ కిచ్చిన కంచరాం, రేగా సరిగా లేవంటున్నారు కదూ! అవి దివ్యమైన మాన్యాలు గదండీ!

తగిన రైతులను ఏర్పాటు చేసుకుంటే బంగారం పండవండీ అవి?''

''అవి యేం పండుతాయో భగవంతుడికే యెరుక. ఆ వూళ్ళలో మా మాన్యాలే కాదు; ఎవరి భూములున్నా పండడం లేదు. ఒక ఏడన్నా మీకు బకాయిలు లేకుండా అక్కడ దస్తు వసూలైందేమో చెప్పండి చూదాం!''

''బకాయిలు వసూలు కాక ఏమవుతాయండీ! సంస్థానంవారు ముక్కు పిండి మరీ పుచ్చుకుంటారు. ప్రజలను తొందరపెట్టకూడదని ఉపేక్ష చేస్తున్నారు గాని, నిజానికి చేతగాక కాదుగదూ! ఇంతకూ మీరు ముఖ్యమైన సంగతి గమనించారు కారు. మాన్యాలక్రింద యివ్వవలసిన భూములను ఎప్పుడో పంపకం చేశారు. మీ కివి అక్కర్లేదంటే మరెవరు మీకోసం తమ భూములను ఇస్తారు? ఏదో యిప్పటి క్కానీయండి; చూద్దాం తర్వాత సంగతి?''

''ఆశ్రితుల కష్టసుఖాలు ఆలోచించి తగిన యేర్పాట్లు చేయిస్తారనే గంపెడాశతో వచ్చాను—ప్రభువు లిలా అనడం ధర్మం కాదు. ఉపయోగం లేని భూములవల్ల కలిగే లాభం పన్నులు తప్ప మరేమీ లేదు. మా మాన్యాలు ప్రభువులు తీసుకుంటే ఆ పన్నుల భారమేనా తగ్గుతుంది.''

''కవిగారు తొందరపడుతున్నారు. మహారాజులుం గారు వచ్చేక, మనవి చేసుకోండి! వారు మాన్యాలు మారుస్తామంటే నాకేం పోయింది? వారు వచ్చేక మీ

యిష్టం వచ్చినట్లు చేయించుకోవచ్చు.''

''ప్రభువు లనుగ్రహిస్తే మాత్రం ప్రయోజనం ఏం వుంటుం దండి? దేవుడు వరమిస్తే మాత్రం పూజారి వరమియ్యొద్దా? మీకు యిష్టం కాని పని యీ సంస్థానంలో ఒక్కనలుసైనా జరగదు? ఇక యీ అజాగళ స్తనాల్లాంటి భూములకి పన్నులుకూడా ఎందుకు కట్టుకోవాలి! మీ యినాములు మీరే గ్రహించవచ్చును. పుట్టించినవాడే రక్షిస్తాడు. ఇంతకీ కవిసార్వభౌములకి కాలం గడవకపోదు. నేను వెళ్ళివస్తాను. సెలవు!''

ఇలా అంటూ సూరకవి తన మాన్యాలకు సంస్థానం వారిచ్చిన పట్టాలు అక్కడే పడవేసి చివాలున లేచి వెళ్ళిపోయాడు. దివాను నిర్ఘాంతపోయి చూస్తూ వుండిపోయాడు.

సూరకవిని చూస్తే దివానుకు ఎప్పుడూ కిట్టదు; ప్రభువైన విజయరామగజపతి మహారాజులుంగారు దేవాలయాలకూ, మసీదులకూ, కవిపండితులకూ, తదితరులకూ యిచ్చిన మాన్యాలు ఏదో విధంగా తీసుకోవడమే అతని సంకల్పం. సూరకవి కిది బాగా తెలుసు. అంచేతే నిర్మొగమాటంగా చెప్పి పట్టాలు అక్కడే పడవేసి వచ్చాడతను.

ఇక ఆ వూళ్ళో వుండడం కూడా అతనికి ఇష్టం కాదు. దమ్మిడీప్రయోజనం లేనప్పుడు—పట్నం కాపురంవల్ల అప్పులు కావడమే కాని మరో లాభం లేదు. కాబట్టే కాపురం కూడా మార్చివేద్దా మనుకున్నాడు. ఊళ్ళో వుంటే ప్రయోజనం

లేకపోయినా తరచు కోటలోంచి వర్తమానం వస్తానే వుంటుంది; తాను వెళ్ళకనూ తప్పదు. ఆ విధంగానూ కాపురం మరో చోటికి ఎత్తివెయ్యడం అన్నివిధాలా మేలని అతనికి తోచింది.

సూరకవికి బుద్ధి పుట్టకనే పోవాలి; కాని పుడితే అది జరిగి తీరవలసినదే! వారం రోజుల్లోనే కాపురం చీపురుపల్లికి మార్చివేశాడు. కుటుంబం అంతా—తానూ, భార్య సీతమ్మా, కొడుకు బాచన్నా—అందువల్ల యెక్కువ బెడద లేకుండానే ఆ పని జరిగిపోయింది.

ఇక 'కుటుంబ భరణం ఎలాగ?' అనే విచారమే లేదు సూరకవికి. అతనికి ధైర్యసాహసాలు ఎక్కువ. మొగమాటం అనేది లేదు. విజయనగరం సంస్థానానికి మిత్రులయిన వారి వద్దకూ, శత్రువులైనవారి వద్దకూ కూడా ఆయన వెళ్ళి బహుమానాలు, వార్షికాలు సంపాదించుకునేవాడు. అతనికి ఆ శత్రుత్వ, మిత్రత్వాలతో సంబంధమే లేదు. పర్లాకిమిడి నుంచి పెద్దాపురందాకా వున్న సంస్థానాలన్నీ ఆయన్ని గౌరవించేవి. ప్రభువులే కాకుండా అక్కడి అధికారులు కూడా ఎక్కువ గౌరవమర్యాదలు చూపేవారు. అలాంటివారిలో విజయనగరం సమీపంలో వున్న శృంగవరపుకోట దివాను పొణుగుపాటి వేంకటమంత్రి ముఖ్యుడు.

శృంగవరపుకోటప్రభువు శ్రీముఖి కాశీపతిరాజు మన్నె రాజులలో ప్రముఖుడు. విజయనగరానికి ప్రతిపక్షి

కోటిలో చేరినవాడు. అతనికి సూరకవి అంటే గొప్ప గౌరవం; అతనికంటే అతని మంత్రి వెంకటమంత్రి మరీ ఎక్కువ గౌరవంతో చూశేవాడు. ఇద్దరూ ఒక కుటుంబం లోని వ్యక్తులవలెనే చాలా చనువుగా వుండేవారు. అంతే కాదు. ఇద్దరికీ బావమరుదుల వరస; ఆయన ఎప్పుడూ సూరకవిని ఏదో హాస్యం ఆడుతూనే వుంటాడు. సూరకవి తరచు శృంగవరపుకోటలో ఆ బావగారి యింట్లోనే వుండేవాడు.

చాయమ్మ వెంకటమంత్రి సోదరి. ఆమెకు పసి తనంలోనే వైధవ్యం సంభవించింది. అందువల్ల ఆమె అన్న గారివద్దనే వుండిపోయింది. సత్కాలక్షేపంకోసం ఆమె సంస్కృతాంధ్రాల్లో కొంత ప్రవేశం కలిగించుకుని రామాయణం, భగవద్గీతా మొదలైనవి పారాయణ చేస్తూ కాలం గడుపుతూ వుంటుంది. చమత్కారంగా మాట లాడడంలో, ఆమె చాలా గట్టిది. సూరకవిని ఏదో హాస్యం ఆడుతూ వుండడం అంటే ఆమెకు చాలా ఇష్టం.

సూరకవి నియోగి అయినా ఆచార, వ్యవహారాల్లో పరమనైష్ఠికుల నందరినీ తలదన్నగలవాడు; ఎప్పుడూ ఆయన సంచారం చేస్తూ వుండినా, దగ్గరబంధువుల యిళ్ళల్లో తప్ప ఇతరత్రా విస్తరివెయ్యడు. స్వయంగా వంటచేసుకుని కాలక్షేపం చేశేవాడు. సమారాధనలలో భోజనం చెయ్యడ మనేది ఎప్పుడూ లేదు.

వెంకటమంత్రి సంపన్నగృహస్థు. నిరతాన్నప్రదాత. ఏదో వ్రతంపేరూ, నోముపేరూ చెప్పి బ్రాహ్మణసమారాధన చెయ్యడం, తన ప్రభువుచేత అలాంటివి చేయించడం పరిపాటి. అలాగంటి సందర్భంలో వెంకటమంత్రిభార్య సూరకవికి మాత్రం ప్రత్యేకంగా వంటచెయ్యడం జరిగేది.

ఒకప్పుడు మామూలుమాదిరిగానే వెంకట మంత్రి గారి యింట్లో గొప్ప బ్రాహ్మణ సంతర్పణ జరిగింది. చుట్టు ప్రక్కల వున్నవూళ్ళనుంచి కూడా చాలామంది బ్రాహ్మణ్యం రావడంచేత వెయ్యిమందికి పైగా జనం పంక్తులు తీర్చి విందు ఆరగిస్తున్నారు. పాచకులతోనూ, తక్కిన తాబేదార్లతోనూపాటు పట్టుతాపితాలు కట్టుకొని వెంకటమంత్రి వడ్డనలోనికి వచ్చాడు. ఆయనతోపాటు ఆయన సోదరి చాయమ్మకూడా నేతిజారీ చేత్తో పుచ్చుకొని వడ్డించ సాగినది.

సూరకవి కూడా అక్కడికి వచ్చేడు. భోజనంచెయ్యడానికి కాదుగాని, అంతమంది బ్రాహ్మణ్యం భోజనం చేస్తూ వుండగా చూచి ఆనందించాలని అతని కోరిక. అతడు సమారాధన జరుగుతూ వున్న చోట ఒక తిన్నెమీద కూర్చుని పదార్థాలు ఎలా చురుకుగా సరఫరా అగుచున్నదీ, అతిథులు ఎలా భుజిస్తున్నదీ గమనిస్తూ వున్నాడు. వండిన పదార్థాలకీ, అవి వెంటనే ఖర్చవుతూ వుండడానికీ అంతం కనబడ్డం లేదు. వెంకటమంత్రిగారి యీ గొప్ప యత్నానికి సూరకవి

మిక్కిలి ఆశ్చర్యపడి ఆశువుగా ఇలా పద్యం చెప్పాడు—

"ఒక్క సముద్రము దక్కగ
తక్కిన సంద్రములు నీ యుదారమహిమచేఁ
జిక్కెగద విప్రభుక్తికి
వెక్కసముగ పొణుగుపాటి వేంకట మంత్రీ!"

"సప్తసముద్రాల్లోనూ ఒక్క సముద్రం తప్ప తతిమ్మా అన్నీ యిప్పుడు బ్రాహ్మణ సమారాధనకి యిక్కడికి వచ్చాయి; అంటే ఇక్కడి పదార్థాలు సముద్రాలవలె అంతం లేకుండా వున్నాయి" అని దీని అభిప్రాయం! దీన్నివిని అక్కడి వారంతా "చాలా అద్భుతంగా చెప్పారండీ సూరకవిగారు!" అని మెచ్చుకున్నారు.

అప్పుడు ఒకమూల నేతివడ్డనలో మునిగి వున్న చాయమ్మ సహజ హాస్యధోరణిలో సూరకవినైపు వున్న పంక్తిలో వడ్డిస్తూ సూరకవితో-

"బావగారు, ఆ సముద్రం ఏమిటంటారు?" అని చిరునవ్వుతో ప్రశ్నించింది.

"మరేం వుంటుందమ్మా! సేవించినవాళ్ళకి బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంటుందని శుక్రాచార్లువారు శపించిన సురా సముద్రం!" అన్నాడు.

ఆమె నవ్వుతూ "అలాగా? అది స్వయంపాక నియమం గల బావగారి కంటూ మా అన్నగారు మీకోసం ప్రత్యేకించి వుంచివేశారండీ!" అన్నది. అందరూ గొల్లుమని

నవ్వారు, సూరకవి వైపే చూస్తూ.

సూరకవి ఆ సమాధానానికి నిర్ఘాంతపోయాడు. ఆమె యుక్తికి ఆశ్చర్యపడి తిరిగి సమాధానం చెప్పడానికి కొంచెం ఆలోచించాడు.

బ్రాహ్మణ్యం అంతా నవ్వు ఆపేసరికే సూరకవి అందుకున్నాడు—

"నిజమే! బావగారు నాకోసం ప్రత్యేకంగా ఆ సముద్రాన్ని వుంచితే వుంచి వుండవచ్చు; కాని యిల్లుపట్టిన ఆడపడుచు దాన్ని తానే వుంచుకుంటుంది; కాని ఎవరికైనా ఇయ్యనిస్తుందా?"

సూరకవి యిలా అనేసరికి అందరూ ఇదివరకు కన్నా ఎక్కువగా నవ్వసాగారు. సూరకవిగారు తగిన సమాధానం యిచ్చారని మెచ్చుకున్నారు.

ఇదివరకు విజయగర్వంతో నలుగురివైపూ చూస్తున్న చాయమ్మ ముఖం దమ్మిడీ అంత అయిపోయింది. ఆమె తల వంచుకుంది.

---

# 2. మూడు మార్గాలు

ఆనందగజపతి ప్రభువు విజయనగర సంస్థానాన్ని పాలిస్తున్న రోజులవి! ఆ మహారాజు రాజ్యవ్యవహారా లన్నిటినీ సమర్థుడైన దివాను బాధ్యతకు అప్పగించి తాను విద్వాంసులతో చర్చిస్తూ విద్యాగోష్ఠిలోనే కాలం గడిపే వాడు. అభినవాంధ్రభోజుడని పేరుప్రతిష్ఠలు సంపాదించిన ఆ ప్రభువుదర్శనం కోరి వచ్చిన పండిత కవులకు గొప్ప పారి తోషికాలు ముట్టుతూ వుండేవి. రాజులకూ, సామంతులకూ కూడా అలభ్యమైన ఆయనదర్శనం పండితులకు చాలా సులభంగానే లభించేది.

ఆనందగజపతి ప్రభువునకు అన్ని శాస్త్రాలలోనూ కొంత కొంత పరిచయం వుంది. చమత్కారంగా మాట లాడడంలోనూ, యుక్తిగా ప్రశ్న లడగడంలోనూ చాలా సమర్థుడు ఆ ప్రభువు!

ఒకనా డాయన సభ తీర్చి, ఏదో విషయాన్ని గురించి ప్రసంగిస్తూ—పండితవర్గంలో ప్రథమస్థానాన్ని అలంకరించిన భగవత్కవి-నరసింహాచార్యస్వామిగారిని చూసి "సత్పురుషు లకీ, దుర్మార్గప్రవర్తకులకూ మార్గాలు ఎలా వుంటాయని మీ భావన?" అని ప్రశ్నించారు. వెంటనే ఆయన "ప్రభు వులకు తెలియని దే ముంది గనుక? సన్మార్గుడికి యిన్ని

మార్గాలు ఎక్కడ? అతనిది ఒక్కటే మార్గం. కష్ట సుఖాలనూ, కలిమిలేములనూ ఎంతమాత్రమూ లెక్కించ కుండా న్యాయమైన ఒక్క మార్గాన్నే ప్రవర్తించడం అతని పద్ధతిగదా! ఇక దుర్మార్గుడి సంగతి చూతామా అంటే— దాన్ని యిదమిత్థమని నిర్వచించడానికి వీలులేదు. అతని మార్గాలు లెక్కలేనివి. ఎలా కావలిస్తే ఆ విధంగా ప్రవర్తించగలడు,'' అని సమాధానం యిచ్చాడు.

మహారాజులుంగారు అంతగా తృప్తిపడినట్లు కనబడ్డం లేదు. 'ఇది అందరికీ తెలిసిన విషయమే' అనే భావాన్ని ముఖంలోనే వ్యక్తంచేస్తూ ప్రశ్నార్థకంగా తక్కిన పండితుల వైపు దృష్టిని ప్రసరింప జేశారాయన. మహారాజులుంగారి భావాన్ని కొందరు గ్రహించలేక "ఆచార్య స్వాములవారు సెలవిచ్చినది దివ్యంగా వున్నదండీ'' అని చెప్పారు. ఏమంటే 'మీరు వారితో ఏకీభవిస్తారా?' అని ప్రభువులు అడుగు తున్నారని భావించి ఇలా అన్నారు. భగవత్కవిగారిమీద ప్రభువులకు గొప్ప గౌరవం! అంచేత ఆయన అభిప్రాయాన్నే బలపరచడం భావ్యమని పండితుల అభిప్రాయం.

ప్రభువులు తమ అభిప్రాయాన్ని కొంత వ్యక్తంచేస్తే తగిన సమాధానం రావచ్చునని అనుకున్నారు. ఆయన అందర్నీ ఒకసారి చూచి "చూడండీ! నేను మిమ్మల్ని అడిగి తెలుసుకోదలచిన మార్గాలు సన్మార్గం, దుర్మార్గంలాంటి ప్రవర్తనకి సంబంధించినవి కావనుకోండి. అవి యదార్థంగా

మార్గాలే! వాటిని గురించి మీ అభిప్రాయం సెలవిస్తారా?' అని ప్రశ్నించారు మల్లా.

అప్పుడు మహారాజావారు స్థాపించిన సంస్కృత నాటక సమాజంలో విదూషకపాత్రను ధరిస్తూవున్న కర్రా వెంకటశాస్త్రిగారు నిలబడి చేతులు జోడించి "మహాప్రభూ! నేను మనవి చేస్తాను. సెలవా?" అని అనుజ్ఞ వేడారు.

వెంకటశాస్త్రి సహజంగా విదూషకుడి గుణాలు అలవడినవాడు. తన మాటాలమూలాన్నీ, చేష్టలమూలాన్నీ నలుగురినీ నవ్వించే స్వభావం ఆతనిది. తెలిసినవాళ్ళు చెప్పవలెనంటూ ప్రభువు లిదివరకే తెలియజేయడంచేత ఆ గోష్ఠిలో వున్న తానూ తనకు తోచినది చెప్పవచ్చు. మళ్ళీ అనుజ్ఞ వేడడం హాస్యగాడి స్వభావం. మరో విశేషం ఏమిటంటే-ఈయన పెద్ద పండితుడు కాడు. మహావిద్వాంసు లున్న సభలో "తగుదునమ్మా!" అని తాను సమాధానం చెప్పడానికి పూనుకోవడం కొంత సాహసమని తనకూ తెలుసు. ఇలాంటి సభలో తాను మాట్లాడడం ప్రభువులకి ఇష్టమగునో, కాదో! కోపం వస్తుందో, ఏమో! అనే దిగులుకొద్దీ ఆయన ప్రభువుల అనుజ్ఞ వేడవలసి వచ్చింది.

"చెప్పవచ్చు" నంటూ ప్రభువులు సైగచేశారు.

"చిత్తం; మనవిచేస్తున్నా" అని ఒక్కనిమిషం ఆలోచనను నటించి, "ఇ దంత గడ్డుప్రశ్న అని, నాకు తోచ

లేను. అందరికీ బాగా తెలిసిన విషయమే!'' అని ఉపోద్ఘాతము ప్రారంభించా డాయన. అది విని కొమ్ములు తిరిగిన పండితులు అతనివైపే చూడసాగారు, ఏ విశేషం బయలు పెడతాడో అని.

"చిత్తగించండి. దుర్మార్గులయిన వాళ్ళకి మార్గం ఒక్కటే. అంతకి ఎక్కువ మార్గాలు లేవు. సన్మార్గుడికీ, దుర్మార్గుడికీ కలిసి రెండు మార్గాలు. ఇక సన్మార్గుడికీ, సన్మార్గుడికీ-వారికలయికలో మూడు మార్గాలు వుంటాయి'' అన్నాడు వెంకటశాస్త్రి.

ఇలా చెప్పి, అతను వివరించడాని క్కొబోలు నిలిచే వున్నాడు. ఆనంద గజపతి ప్రభువు చిరునవ్వు నవ్వాడు.

"ఏమిటీ యిది? వెంకటశాస్త్రుల్లు తల్లకిందులా చెప్తూ వున్నాడే! దుర్మార్గుడిది ఒక్కటే మార్గమట. సన్మార్గుడికి అనేకమార్గాలట! ఇదంతా అయోమయంగా వుంది'' అని అక్కడి సభ్యులు అంతా అనుకుంటూ, ఏమీ అర్థంకాక నిర్ఘాంతపడి వున్నారు. ఈ విషయాన్ని ప్రభువు గ్రహించకపోలేదు. ఆయన చిరునవ్వు నవ్వుతూ "చాలా బాగుంది. విదూషకుడుగారు హాస్యధోరణిలో అన్నా, చక్కని సమాధానమే చెప్పారు'' అని ప్రశంసించారు.

మహారాజులుంగారు వేసిన ప్రశ్నను బాగా అర్థంచేసుకున్నవాడు వెంకటశాస్త్రిగారే అనీ, అతను చెప్పిన సమాధానాన్ని గ్రహించగలిగినవారు ఒక్క మహారాజులుంగారే

అనిన్నీ తేలిపోయింది. మిగిలిన సభ్యు లందరూ తలలు వంచు కున్నారు. అప్పుడు మహారాజులుంగారు "శాస్త్రిలు గారూ! మీ సమాధానాన్ని వివరించి తెలియజేస్తారా?" అని ప్రశ్నించారు.

వెంకటశాస్త్రి "ప్రభువుల ప్రశ్నకి ప్రభువులే తప్ప మరొకరు సమాధానం యియ్యలేరు. అందుచేతనే నాకు మొదట ఏమీ తోచక ఊరుకున్నాను. ఇక లాభం లేదంటూ ప్రభువులే తమ సమాధానాన్ని ప్రశ్నరూపంగానే ప్రకటించారుకదా! తాము సెలవిచ్చిన మార్గాలు ప్రవర్తన లకి సంబంధించినవి కావనీ, యథార్థంగా మార్గాలే అనిన్నీ సెలవిచ్చారు గదా! దాన్ని అనుసరించే నేనున్నూ, యుక్తి మీద ఆధారపడి ఇది కాకపోతుందా అనే క్షమాతో మనవి చేశాను. మిడతంభట్లు జోస్యంలాగ అది యథార్థమైనది. ఇందులో నా తెలివితేటలు ఏమిన్నీ లేవు. ప్రశంసకి నేనెంత మాత్రమూ అర్హుడను కాను.

"ఇక మనవిచేస్తాను—మార్గాలు బాటలే కాని మరొకటి కావని ప్రభువులే చెప్పారు. అలాంటప్పుడు దుర్మార్గుడికి ఒకటే మార్గం. అతనికి ఎదురుగా మరో దుర్మార్గుడు వస్తే-వాడూ తప్పుకోడు. వీడూ దారి యివ్వడు. ఇద్దరూ ఒక్క బాటమీందే ఎదు రెదురుగా నిటారున నిలువ బడతారు. లేదా కొట్టుకుంటారు. బలంగలవాడు—బల హీనుడ్ని పడదోసి, వాడిమీదనుంచి వెళ్ళిపోతాడు.

"ఇక రెండోది—మంచివాడికి దుర్మార్గుడు ఎదురౌతా డనుకోండి. దుర్మార్గు డెన్నడూ దారి విడిచి నడవడు. సన్మార్గుడే దారి తప్పుకుంటాడు. అప్పుడు దుర్మార్గుడి కొక దారీ, సన్మార్గుడిది ప్రక్కదారీ—రెండు దారులు ఏర్పడుతాయి.

"ఇద్దరు సన్మార్గులు—ఒకరి కొకరు ఎదురయితే ఇద్దరూ మంచివాళ్ళు కాబట్టి తనకు ఎదురుగా వచ్చినవానికి దారి యివ్వాలంటూ ప్రక్కకు యిద్దరూ తప్పుకొంటారు. అప్పుడు అసలుదారి ఖాళీగా వుండి దానికి — కుడి, యెడమవైపులు—రెండు ప్రక్కలా దారు లేర్పడుతాయి. అందువల్ల మూడు మార్గాలు ఏర్పడుతాయి. కాబట్టే ఇద్దరు మంచివాళ్ళు కలిసికొన్నప్పుడు మూడు మార్గాలంటూ మనవి చేశాను" అని వివరించాడు.

"వడ్లగింజలో బియ్యపుగింజ! ఈమాత్రం మన కప్పుడు తోచలేదే! ఎవరికి తెలియదిది?" అంటూ అందరూ ఆశ్చర్యపోయారు.

# 3. సమ్మానం

బాలామణి దక్షిణదేశం అంతటా పేరుమోసిన నాట్యకర్త్రి. అంత కొలది వయస్సులో అంత గొప్ప పేరు మోసిం దంటే-ఆమెకు నాట్యంలో ఎంత పాండిత్యం వున్నదీ వ్యక్తం కాగలదు; ఆమె గొప్ప అందకత్తె కూడాను.

బాలామణి తండ్రి ప్రోత్సాహంమీద ధనసంపాద నార్థం ప్రసిద్ధ పట్టణాలకి వెళ్ళి, ప్రభువులవద్ద తనశక్తిని చూపించి బహుమానాలు పొందటానికి దండయాత్రకి బయలు దేరింది. ముందుగా విజయనగరం వచ్చి, విద్యావ్యసనం గల విజయరామ ప్రభువు దర్శనం కోరింది. తాను నాట్యంలో అద్వితీయనంటూ తనశక్తి ప్రభువులకు తెలియజేయకోరింది.

ఎప్పుడూ పండితులతో చర్చలు సాగిస్తూవున్న విజయరామగజపతి ప్రభువుకు కవులంటేనే గౌరవం తక్కువ. సాధారణంగా కవులకి దర్శనం దొరికేది కాదు. నాట్యమంటే మరీ ఈసడింపు! అలాటి ప్రభువు ఆమె నాట్యం చూడ్డానికి అనుమతిస్తాడా?

తన నాట్యం చూడ్డానికి జనం తండోపతండాలుగా తహతహమంటూ వస్తారు! అట్టి తాను ఈ ప్రభువుదగ్గర చిల్లిగవ్వకు పనికిరాక పోయానని బాలామణికి కష్టం అనిపించింది. అయినా అధైర్యపడలేదు. ఆ ప్రభువు దర్శనం

దొరికితే అతనిని అంగీకరింపచేయగలనని ఆమెవిశ్వాసం.

చాలాదూరంనుంచి వచ్చాననీ, ప్రభువువారు దర్శనం యిప్పిస్తే చూచి, వెళ్ళిపోతాననీ, ఆమాత్రం అనుగ్రహించాలనీ వర్తమానం పంపింది. విధిలేక విజయరామగజపతి ప్రభువు బాలామణికి దర్శనం యిచ్చాడు.

ప్రభువు బాలామణిని చూచీ చూడడంతోనే ముగ్ధుడయిపోయాడు. పిదప ప్రశ్నించి, సంగీత సాహిత్యాల్లోనూ, నాట్యశాస్త్రంలోనూ ఆమెకు గట్టి పాండిత్యం వున్నదనీ, నాట్యమంటే ఎక్కువ అభిమానమనీ తెలుసుకొన్నాడు.

ఆమె కోరికను కాదనలేక మరునాడు నాట్యప్రదర్శనానికి ఆయన అనుమతించాడు.

*　　　*　　　*

మహారాజులుంగారు తక్తుమీద అధిష్ఠించి ఉన్నారు. సభ్యులంతా వారివారికి తగిన స్థానల్లో కూర్చుని ఉన్నారు. బాలామణి అత్యద్భుతంగా నాట్యం సాగిస్తున్నది. ఆమె సౌందర్యమూ, పోషకర్కా, నాట్యభంగిమలూ, కోకిల స్వరమూ అందరినీ ముగ్ధులను చేసివేస్తున్నాయి. ఆమె ప్రత్యేకంగా శ్రీ విజయరామగజపతి మహారాజులుంగారిమీద రచించబడిన ఒక జావళీని అభినయిస్తూ వుంటే ఆయన పరవశులైపోయారు. నాట్యం అంటే చాలా చులకనగా చూసే ఆ ప్రభువుకి 'నాట్యం ఇంత గొప్పదా?' అని అనిపించింది. ఆమెకు ఎంతన్నా బహుమానం ఇవ్వవచ్చునని

ఆయన అభిప్రాయపడ్డారు.

నాట్యం ముగిసింది. బాలామణి తల వంచి, చేతులు ముకుళించి సవినయంగా మహారాజులుంగారికి నమస్కారం చేసింది.

'నేటి నీ యీ అద్భుత నాట్యప్రదర్శనానికి చాలా ఆనందం కలిగింది మాకు. నిన్ను ఎలా సత్కరించాలో తెలియకుండా వుంది' అన్నారు మహారాజులుంగారు.

'అది ప్రభువుల దయాధీనం! వందలూ ఇచ్చినవా రున్నారు, వేలూ ఇచ్చినవా రున్నారు. లక్షలు ఇవ్వడానికి కూడా తమవంటి ప్రభువులు సమర్థులు! ఆమీద మా అదృష్టం!' అన్నది బాలామణి మందహాసం చేస్తూ.

మహారాజులుంగారు దివాను జగన్నాథరాజుగారి వైపు సాభిప్రాయంగా చూపు ప్రసరించారు.

'ప్రభువులవారు నీ సామర్థ్యానికి చాలా మెచ్చు కున్నారు. సంతృప్తికరంగానే సమ్మానం జరుగుతుంది' అన్నారు దివానుగారు బాలామణిని తిలకిస్తూ.

* * *

మహారాజులుంగారూ, దివానుగారూ ఆలోచనా మందిరంలో కూర్చుని, ఏవేవో వ్యవహారాలు మాట్లాడు కుంటున్నారు.

యాదాస్తు పుస్తకం తీయగా మొదట బాలామణి పేరూ, ఆమెకు ఇవ్వవలసిన బహుమానం వివరాలూ

ఉన్నాయి.

దాన్ని చూచి దివాను ముక్కుమీద వేలు వేసుకున్నాడు.

మహారాజులుంగారు 'ఏమి'టన్నట్టు అతనివైపు చూచారు.

'మరేమీ లేదండి! ఇలాంటి త్యాగాలు చేస్తే జమీందారీ మూడు రోజుల్లో ఎగిరిపోతుందని భయంగా వుందండి' అన్నాడు దివాను ధైర్యంతో.

బాలాఃమణికి లక్ష రూపాయలు ఇవ్వవలసినట్లుగా ఆ లెక్కలో వెయ్యబడి వుంది!

'మాకు ఆనందం కలిగింది. లక్షా యివ్వాలని సంకల్పించుకున్నాం! ఇయ్యవలసిందే!'

దివాను మరి ఎదురు జబాబు చెప్పలేదు. 'చిత్తం, చిత్తం, మహాప్రభూ! ఏలినవారి యిష్టప్రకారమే జరిగించవచ్చు. కాని నా మనవి యేమిటంటే - కొంచెం వ్యవధి కావాలని ప్రార్థన' అన్నాడు.

'వ్యవధి కావాలా? ఎందుకూ?'

''ప్రభువువారు చిత్తగించాలి! లక్ష రూపాయలంటే సామాన్యం కాదు. ఇప్పుడు ధనాగారంలో నాలుగువేలకంటె ఎక్కువ మొత్తం లేదు. మూడు రోజులు గడువిస్తే ఠాణాలకి తాఖీదులు పంపి సొమ్ము వసూలు చేయించి తెప్పిస్తాను. తమరు ఖుద్దున ఆ నాట్యకత్తెకు బహుమానం

ఇయ్యవచ్చు.''

మహారాజులుంగారు సమ్మతించక తప్పినది కాదు.

మూడు రోజులూ గడిచినాయి.

తన సమ్మానం సంగతి యింకా యేమీా, ఎందుకు తేలలేదో తెలియక బాలామణి తహతహపడుతూ వుండగా, మర్నాడు దర్బారులో సమ్మానం జరపబడుతుందంటూ ఆమెకి వర్తమానం వచ్చింది.

మహాఘనంగా సమ్మానం జరుగుతుందని ఆమె ఆనందంతో ఆకాశం అందుకుంటూ ఉంది.

* * *

శ్రీ విజయరామ గజపతి మహారాజులుంగారు కొలువుతీర్చి ఉన్నారు.

సభాభవనం సామంతులతోటీ, ఉద్యోగులతోటీ, ప్రేక్షకులతోటీ కిటకిటలాడుతూ వున్నది.

బాలామణి ఒకప్రక్క తన బలగంతో వచ్చి కూర్చున్నది.

దివాను జగన్నాథరాజుగారు నిలిచి, సభ్యులను సంబోధిస్తూ 'నేడు చాలా సుదినం? ప్రభువువారికి ఠాణాల నుండి దస్తు ఖుద్దున సమర్పించబడే దినం! ఈ దినమే నట్టువ కత్తెల్లో ఆరితేరి, సభ్యులందరినీ,-ఎక్కువగా ప్రభువు వారినీ రంజింపజేసిన బాలామణికి సమ్మానం జరిగేరోజు! మొదట ఆ యా ఠాణేదారులు దస్తు సమర్పిస్తారు' అని

చెప్పి తన స్థానంలో కూర్చున్నాడు.

ఒక్కొక్క ఠాణేదారూ వచ్చి ప్రభువులకి వంగి, వంగి నమస్కారం చేసి, తాము తెచ్చిన దస్తు రూపాయిాల సంచులు లెక్కపెట్టి పడవేసి, దివానుగారివల్ల రశీదు తీసికొని వెనక్కి వెళ్ళసాగినారు.

ఇలా పది ఠాణాలనుంచి వచ్చిన దస్తు లక్ష రూపాయిాలు చేరింది. సీళ్ళువేసిన నూరు సంచులు కుప్పలా పడ్డాయి; ఒక్కొక్క సంచీలో వెయ్యేసి వెండి రూపాయలు ఉంటాయి. అసలు 'సంచీ' అంటేనే వెయ్యి రూపాయలంటూ తెలుగుదేశంలోని పరిభాష కదూ!

తర్వాత దివానుగారు లేచి 'యికమీాద బాలామణికి సమ్మానం జరుపబడుతుంది' అని చెప్తూ ప్రభువులవైపు తిరిగి 'ప్రభువులు అనుగ్రహించి బాలామణిని సమ్మానించవలెనని ప్రార్థన' అని మనవిచేశారు.

మహారాజులుంగారికి ఆలోచన పోయింది; మనస్సు సందిగ్ధంలో పడింది! బాలామణికి లక్ష రూపాయిలు ఇవ్వాలని మొదట అనుకొన్నా, అలా చేయడం అనుచితం అని ఆయనకు తోచింది. రూపాయిలన్నీ కైలాస పర్వతంవలె గుట్టగా పడివున్నాయి! "ఎన్ని నెలలో, ఎందరు ఉద్యోగులో, ఎన్ని విధాలనో తంటాలు పడితేనేగాని యింత సొమ్ము తేలదు! రైతులందరూ చెమట ఊడ్చి, శ్రమించి పండించిన పంటవల్ల లభించిన దీ సంపద! దీన్ని అనాలోచితంగా

ఒక నాట్యకత్తెకు — ఒక గంటసేపటి నాట్యానికి సమర్పించడమా? ఇలా ఎంత మాత్రమూ జరగకూడదు!" అని ఆయన మనస్సుకు తట్టినది!

తాను అనాలోచితంగా లక్ష రూపాయిలు యివ్వమంటే — దానికి ఇష్టపడక తన శ్రేయోభిలాషి అయిన దివాను జగన్నాథరాజు పన్నిన పన్నాగమే యిదంతా అని ఆయనకు బోధపడింది!

దివాను యుక్తికి, మహారాజులుంగారు మనస్సులో చాలా సంతోషించారు!

అయితే యిప్పుడీ సమస్య తేలడమెలాగ? తనకేమిన్నీ పాలుపోలేదు!

ఎంత ఇవ్వాలో తెలియడం లేదు. ప్రభువువారు దివానువైపు అమాయిక దృష్టితో చూశారు!

ఆయనమనోభావం గ్రహించాడు దివాను. తన్ను ఈ చిక్కులోంచి గట్టెక్కించాలంటూ దాని అర్థమట?

ఆ యిద్దరి మూగభాషా వారికే కాని, మరొకరికి అర్థం కాదు!

దివానుగారు లేచారు.

"బాలామణి నట్టువకత్తెల్లో అగ్రగణ్య అని మెచ్చుకుంటూ ప్రభువులు ఆమెకు 'నాట్యకళాప్రపూర్ణ' అనే బిరుదాన్ని అనుగ్రహిస్తున్నారు" అని ప్రారంభించారు. సభ్యులందరూ కరతాళ ధ్వనులు చేస్తూ, తమ హర్షాన్ని

వెలిబుచ్చారు.

'బాలామణి నైపుణ్యాన్ని డబ్బుతో విలువ కట్టడ మనేది అసాధ్యం! అయినా ప్రభువులు ఆ విషయంలో తమ ఔదార్యాన్ని ప్రకటిస్తున్నారు' అని ఒక నిమిషం ఆగి 'ఇప్పుడే లక్ష రూపాయీల దస్తు వసూలయి రావడం మీ రందరూ చూచారు' అన్నారు దివానుగారు.

'ఔ'నని అందరూ తల వూపారు.

'ఈ ధనరాశిలో ఆమె మొయ్యగలిగినంత ధనాన్ని సత్కారంగా బాలామణే తీసుకోవాలని, అనుగ్రహించారు ప్రభువులు!

'ఆమె ఎంత తీసికొన్నా అభ్యంతరం లేదు. ఈ లక్ష రూపాయీలు ఆమె మొయ్యగలిగితే ప్రభువులు నిరాక్షేపణగా అనుగ్రహిస్తారు.'

ఈ చివరివాక్యం ఆయన నవ్వుతూనే అన్నారు.

మహారాజులుంగారి విశాలహృదయాన్ని అందరూ ప్రశంసించారు.

లక్ష రూపాయీలూ ఆమెకు ముడుపు చెల్లిస్తారేమో అని కొందరు మొదట దిగులు పడ్డారు! దివానుగారి యుక్తికి వారందరూ చాల మెచ్చుకున్నారు.

బాలామణి ముఖం వెలవెల పోయింది! తొలుతనే ఆమె అబల; అందులోనూ సుకుమార శరీర. ఆమె ఎన్ని రూపాయలు మొయ్యగలదు?

అయినా సాహసించి సంచుల దగ్గరకు వెళ్ళి రెండు చేతులతోనూ రెండు సంచులు లంకించుకుని ఎత్తింది. అవే బరువుగా ఆమెకు తోచింది. అయినా లేని బలం తెచ్చుకుని ఆ రెండు సంచులనీ పట్టుకున్న చేతులతోనే మహారాజులుం గారికి నమస్కారం చేసింది.

నమస్కారం చేసేటప్పుడు కొంచెం చేతులెత్తవలసి వచ్చింది. ఆ సంచులు మరీ బరువు అనిపించింది. వెంటనే అవి చేతుల్లోంచి జారిపోయి గల్లుమని ధ్వనిచేస్తూ క్రింద పడిపోయాయి.

అందరూ గొల్లుమని నవ్వుతూ కోలాహలం చేశారు.

బాలామణి కన్నులలో నీళ్ళు గిర్రుమని తిరిగాయి.

చివరికి ఆమెకు ఒక దమ్మిడీ అయినా ముట్టకపోయిం దన్నమాట?

దివానుగారు లేచి నిలవగానే కోలాహలం మాని జనం సర్దుకున్నది.

"మరేం ఫర్వాలేదు! బాలామణి మొయ్యలేక పోయినా ఆ రెండు సంచుల రూపాయిలూ ఆమెవే! శ్రీ మహారాజులుంగారు ఆ రెండువేల రూపాయిలు ఆమెకు సమ్మానంగా సమర్పిస్తున్నారు. ఆమె ఎలాంటి సంకోచమూ పడనక్కర్లేదు. వాటిని గ్రహింపవచ్చును" అన్నారు.

సభ్యులందరూ చాలా సంతోషించారు! మహారాజు లుంగారు నిర్ఘాంతపోయారు! లక్ష రూపాయిలు ఇవ్వదలచు

కున్న తనచేత రెండువేల రూపాయిలు — తన ఔదార్యానికి లోపం లేకుండా దివాను ఎలా ఇప్పించినదీ తలచుకొని మనస్సులోనే అతన్ని మెచ్చుకున్నారు ఆ ప్రభువులు!

శ్రీ [illegible]

[illegible]

---

# 4. గెలుపు

అవి జగన్నాథరాజుగారి హయాంనాటి రోజులు!

పెనుమెత్స జగన్నాథరాజుగారి పేరు వింటే పిట్టలు కూడా నీళ్లు తాగేవి కావు! ఆయనది సుగ్రీవాజ్ఞ! విజయ నగర సంస్థానం పొలిమేరలో ఆయనకి అణగివుండని జీవం లేదు.

ఆయన ధర్మమూర్తి!. మాట కొంత దురుసుగా వున్నా పది కుటుంబాలను నిలబెట్టే మార్గం వెతకడమే ఆయన ఆలోచన!

ఆయన చెడి బతికిన వాడు! మొదట చాలా స్వల్ప నౌఖరీలో ప్రవేశించి తన బుద్ధి చాకచక్యంవల్ల పై పదవు లకి పోతూ, రోజు రోజుకూ ప్రభువుల అనుగ్రహాన్ని పొందుతూ, నాయబ్ దివానుగిరీ చెలాయించి చివరకు హెడ్డు దివానై విజయనగర సంస్థానాన్ని ఆయన ఏకచ్ఛత్రాధి పత్యంగా పరిపాలించాడు! ఇతని హయాములో ప్రభువులకు రాజ్య కార్యాలను గురించిన ఆలోచనే అక్కర లేకపోయేది!

చదివినది ప్రయిమరీ అయినా ప్రతిభాశాలి కావడం చేత అతడు రాజ్యతంత్రప్రవీణు డయ్యాడు. విద్యాధికుల కన్నా దుర్లభమైన గొప్ప మర్యాదా, పలుకుబడీ సంపా దించాడు.

ఆంగ్ల భాషావాసన ఆయనకు అణుమాత్రమూ లేదు. ఒకప్పుడు మద్రాసులోవుండే గవర్నరు విజయనగరం వస్తున్నాడని తెలిసి, ఆయనకు ఘనంగా స్వాగతం యివ్వడానికి అత్యద్భుతంగా ఏర్పాట్లన్నీ చేశాడు. గవర్నరుగారితో మాట్లాడ్డానికి ఇంగ్లీషు రావాలి కాబట్టి, దాన్ని కొన్నిదినాల పాటు అభ్యాసం చేశాడు. తన ఏర్పాట్లను చూచి మిక్కిలి సంతోషించి, అభినందించిన ఆ పాశ్చాత్య ప్రభువుతో "What make is my make? Your honourable make is a make," అని, ఆయనకు ఎక్కువ నవ్వు కలిగించాడట. 'మాలాంటి వాళ్ళం ఏమి చెయ్యగలమండి! మీవంటి ప్రభువులు చేశేదే చేత' అని దీని అభిప్రాయమట! ఆమాట యిప్పటికీ జనల్లో మాసి పోలేదు! ఆయన ఆంగ్ల భాషాపరిజ్ఞానం అంతమాత్రం!

చదువుకీ, తెలివి తేటలకీ అట్టే సంబంధం లేదని అతని అభిప్రాయం. అంతేకాదు. చదువురాని వాళ్ళనీ, తెలివి తేటలు లేనివాళ్ళనీ కూడా ఆయన నిరసించి యెరగడు. ఏ విషయంలోనైనా, తమకు శక్తి వున్నదని గర్వించినవాళ్ళకు తగిన ప్రాయశ్చిత్తం చేసేవాడు కూడాను. బుద్ధి చాతుర్యం, విద్యల సంగతీ యెలా వున్నా మనుష్యుడై పుట్టిన ప్రతి వాడున్నూ సుఖంగా జీవించి తీరాలనే అతని సిద్ధాంతం! అందుకనే—సంస్థానంలో పనిచేతకాని వుద్యోగులు వున్నా, వాళ్ల పొట్టమీద ఎన్నడూ కొట్టేవాడు కాదు.

ఒకసారి కొందరు గుమాస్తాలు ప్రభువువారికి ఒక మహాజరు వ్రాసి పంపుకున్నారట! అది చాలా అవక తవక గానూ, అసభ్యంగానూ వుండినదట! తక్కిన కాగితాలమధ్య వున్న అది యెలాగో మహారాజులుంగారి కంటపడింది. ప్రభువులు దాన్ని యీాయనకు చూపిస్తూ, 'మన సంస్థానంలో యిలాంటి ఉద్యోగస్థులే కదూ వున్నారు?' అని అడిగారట! ఈయన చేతులు జోడించుకొని, 'ప్రభూ! అందరూ ఒక్కలాంటి వాళ్లే వుండరు. ఎవ రెలాగున్నా మన సంస్థాన వ్యవహారాలు సక్రమంగానే జరిగిపోతూ వున్నాయి. జమాబందీ నిలిచి పోలేదు' అని సమాధానం చెప్పాడట! తిరిగి మహారాజు లుంగారున్నూ ఏమీా అనలేకపోయారట!

మహారాజులుంగారు ఏదైనా పని సంకల్పిస్తే దివాను గారి అభిప్రాయం సాధారణంగా దానికి విరుద్ధంగానే వుండేది. అది మొదట్లో ప్రభువులకు చాలా కష్టంగా వుండేది. కాని దివాను నిదానంగా — తన అభిప్రాయమే సరియైనదంటూ క్రియారూపంలో చూపేవాడట! అప్పుడు ప్రభువులు దివానుఅభిప్రాయమే సరియైనదని మెచ్చుకునే వారట! ఇలాంటి సంఘటనలు ఎన్నో జరిగినవి! ఈ విష యంలో ఎప్పుడూ గెలుపు దివానుదే కావడం, ప్రభువులు అభిప్రాయం మార్చుకోవడం జరుగుతూ వుండేది.

*   *   *

రామావధానులుగా రంటే శ్రౌత, స్మార్తాల్లోనూ,

అధ్యయనంలోనూ అఖండుడన్నమాట! ఆరోజుల్లో ఆ విష యాల్లో గంజాం, విశాఖపట్నం జిల్లాలలో ఆయనకు పై చేయి లేదు. అందువల్లనే-ఆ వంశానికే చెందిన యీాయన-సుప్రసిద్ధులైన బులుసు - పాపయ్య శాస్త్రులు గారికి సరిసమానమనే పేరు కూడా వచ్చి - క్రమంగా స్వంత పేరు మరుగుపడి - పాపయ్యావధానులుగారనే పేరే వాడుకకు వచ్చినది.

రామావధానులుగారు జీవికకోసం స్వగ్రామమైన గరికివలస అగ్రహారం విడిచి - దానికి పదిమైళ్ళ దూరంలో వున్న పట్నం — అంటే విజయనగరం చేరుకున్నారు. వచ్చిన కొద్దికాలంలోనే రాజాశ్రయం లభించినది. తత్ఫలితంగా ఉద్యోగ సంపాదన జరిగి, మహారాజులుంగారి పురోహిత వర్గంలో ఒక స్థానం ఆక్రమించుకున్నారు.

రోజూ నడవవలసిన ఔపాసనాగ్నిహోత్రాన్నీ, తదితర స్మార్తకర్మలనీ నడపడానికి యాజమాన్యం వహించారాయన.

సుస్వరంగానూ, చెవులకు ఇంపుగానూ వుండే అవధానులుగారి వేదపారాయణాన్ని అనేకసార్లు విని, మహారాజులుంగారు చాలా సంతోషించేవారు. అగ్నిహోత్రాలు సక్రమంగా జరిపించడంలో వీరి శ్రద్ధాభక్తులను మెచ్చుకునేవారు. క్రమక్రమంగా అవధానులుగారిమీద మహారాజులుంగారికి అభిమానం వృద్ధికాసాగినది!

లక్ష్మీకటాక్షం ఎక్కువ లేకపోయినా ఆ అభిమానమే పదివేలంటూ మురిసిపోయారు రామావధానులు గారు!

అయినా, ఆయన దరిద్రం అనుభవించలేదు. అద్దె కొంపబాధ లేకుండా, అయ్యకోనేటి తూర్పుగట్టున - ఆంజనేయస్వామి దేవాలయానికి సమీపంలో విశాలమైన స్వంత యిల్లు వున్నది. చుట్టపక్కాల రాకపోకలతోను, అతిథ్యభ్యాగతుల మర్యాదలతోనూ యెప్పుడూ యిల్లు కలకలలాడుతూ వుండేది. ఇలా వుండడమే ఆయనకు ఎక్కువ ఆనందం!

మహారాజులుంగారికి మత విషయాలలో పట్టుదల యెక్కువ! నిత్యకర్మలు సక్రమంగా జరిగితేనేగాని అయనకు తృప్తి వుండదు. తాము ఎక్కడికయినా మకాముకు వెళ్ళితే అవధానులుగారిని కూడా తమతో తీసుకొని వెళ్లేవారు.

* * *

మహారాజులుంగారు భీమునిపట్నం మకాముకు వెళ్ళి వారం రోజులకు పైగా అయినది. వారు యిన్నాళ్ళు అక్కడ వుంటారని యెవ్వరికీ తెలియదు. అన్ని విషయాలూ తెలిసిన దివాంజీవారి కయినా యీ సంగతి తెలియదు.

ఫలానా రోజున వస్తారని వూహించడానికిన్నీ వీలు లేదు.

బుధవారానికి బుధవారం యెనిమిదీ, గురువారం తొమ్మిదీ, శుక్రవారం పదీ. ఆ శుక్రవారం ఉదయం ఒక శిపాయి గబగబా దివాన్‌జీవారి యింటికి పరుగెత్తి వెళ్ళి, ఆయనతో 'ప్రభూ! మహారాజులుంగారు వస్తున్నారు' అని మనవి చేశాడు.

పది రోజులదాకా మహారాజులుంగారి సమాచారం తెలియక విచారంతో వున్న దివానుగారి ముఖం సంతోషం చేత చేటంత అయినది. 'నిజమేనా? ప్రభువువారు వస్తున్నారా?' అని ఆయన ఆదుర్దాగా అడిగారు.

'చిత్తం, చిత్తం. నేను పొద్దు పొడవకముందే వంతు ప్రకారం కోట ఆగ్నేయమూల బురుజుమీద గస్తీకి వెళ్ళినాను. గస్తీ తిరుగుతూ వుండగా అరగడియ ముందే నాకు చింతలవలస మొరకలమీద రెండుజోడుగుర్రాల బగ్గీ తురుఫు సవార్లతో కానవచ్చినదండి! ఈ సంగతి ఏలినవారికి తెలియపరచగలందులకు పరుగెత్తుకొని వచ్చానండి!' అని ఆ సిపాయి అన్నాడు.

దివానుగారి యిల్లు కోటకు దగ్గరగా వుండడంచేత – వాడు తిన్నగా వెళ్లి ఆయనకే మనవిచేశాడు.

దివానుగారు తొందరగా కోటు తొడుగుకొని, తలపాగా పెట్టుకొని, కనబడిన నౌకర్లను హెచ్చరిస్తూ కోటలోకి వచ్చేరు. వచ్చి తామూ బురుజు యెక్కి చూచి, సందేహం తీర్చుకున్నారు. అప్పటికి మహారాజులుంగారి

బగ్గీ కోసుదూరంలో వున్న ధర్మపురికి వచ్చింది, తురుపు సవార్లతో కూడా. వెంటనే ఆయన హడావుడిగా అక్కడి నుంచి దిగి, అందరినీ తగిన సరంజాములో వుండాలని హుకుం చేశాడు.

కోట దేవిడీకి ముందున్న మండపాలవద్ద మామిడి తోరణం కట్టబడింది. రోడ్డుకు రెండు వైపులా అరటిచెట్లూ, పూర్ణకలశలూ నిలుపబడ్డవి. సింహద్వారం గోపురం మీద భజంత్రీవాళ్లు ఢంకా నౌబత్తులూ అవీ సరిచేసుకుని, బగ్గీ కోటను సమీపించగానే మంగళవాద్యాలు మోగించడానికి సిద్ధంగా వున్నారు. మోతీమహలు బయట ఉద్యోగస్థులందరూ ప్రభువువారికి ఎదుర్కోలు ఇవ్వడానికి బారులుతీరి నిలిచి వున్నారు.

ప్రభువులు పైచోట్లకు వెళ్లి, తిరిగి వచ్చేటప్పుడు యిలాగు మర్యాదా చూపడం పరిపాటి.

మహారాజులుంగారు మకాము వెళ్ళినందున - వారం పది దినములనుంచీ వెలవెలపోతూ వున్న కోటకు యిప్పుడు కళాకాంతులు వచ్చాయి.

తురుపు సవార్లతో బగ్గీ కోటను సమీపించేసరికి గోపురంమీద ఢంకా నౌబత్తులు మ్రోగడం ప్రారంభమైనది. దేవీపూజ ముగించి పూజారి తీర్థ ప్రసాదాలు పట్టుకొని ఉద్యోగుల వరుసకి ముందుగా నించున్నాడు. వేదపండితులు విభూతి ధరించి, శాలువలు కప్పుకొని, వేద పారా

యణం ప్రారంభించారు.

బగ్గీ మోతీమహలు చేరింది. ఉద్యోగస్తులు తమ దుస్తుల్నీ, పెదవులనీ సవరించుకుంటున్నారు. జగన్నాథ రాజుగారు - అంటే - దివాను గబగబా దగ్గరకు వచ్చి బగ్గీ తలుపు తెరచి, చేతులు జోడించుకొని నిలుచున్నారు.

బగ్గీలోంచి దిగిన వారెవరూ?

మహారాజులుంగారు కారు! వారి పురోహితుడు రామావధానులు గారు!

నుదుట విభూతి పెండికట్లతో, బిళ్ళగోచి నీర్కావి ధోవతితో, మెడలో రుద్రాక్షతావళంతో, చంకను అంగవస్త్రంతో—ఆ విగ్రహం బగ్గీలోనుంచి దిగి, యీ ఆర్భాటం అంతా అర్థంకాక నిశ్చేష్టతతో నిలిచిపోయింది.

దివానూ కొయ్యబారి నిలిచిపోయాడు.

భోగం అంటే ఏమిటో యెరగని ఆ చాదస్తపు బ్రాహ్మడికి పదిహేను నిమిషాల పాటు రాజభోగం జరిగింది.

అతడు దివానువైపు చూచి, తడబడిన మాటలతో 'మహారాజులుంగారు వెనుకనుంచి వస్తారట! ముందు నన్ను పంపించారు' అని మనవి చేశాడు.

*　　　*　　　*

దివాను చిన్నబోయిన మనస్సుతో తనలో అనుకున్నాడు— 'యీసారి మహారాజులుంగారిదే గెలుపు! నన్ను గెలవడానికే ప్రభువులు ఈ పంగిడీ అంతా పన్నినారు' అని.

# 5. లక్క పందిరి

అదృష్టమంటే జగన్నాథరాజుగారిదే అదృష్టం! ఏమంటే-

ఆయన మొదట ఒక చిన్న గుమాస్తాగా విజయనగర సంస్థానంలో అడుగు పెట్టేడు. చదువు చూస్తే నాలుగో క్లాసు కంటే ఎక్కువ లేదు. అయితేనేం? అద్భుతమైన తెలివితేటలు గలవాడు. పనిలో చాలా నిక్కచ్చిగా ఉండే వాడు. ఎవరిదగ్గిర ఏ విధంగా ప్రవర్తించాలో అతనికి బాగా తెలుసును. ఆ కారణంచేత జగన్నాథరాజుగారు ప్రభువైన విజయరామగజపతి మహారాజులుంగారి మన్ననలకు పాత్రమై, అభివృద్ధికి వస్తూ అచిరకాలంలోనే జమీందారీకి అసిస్టెంటు దివానై, తర్వాత మహారాజులుంగారి బలవంతంమీద హెడ్డు దివానుగిరీ చెలాయించటానికి పూనుకున్నారు.

దివానుగారిది సుగ్రీవాజ్ఞ. దాన్ని ఎవ్వరూ కూడా అతిక్రమించలేరు. ఎప్పుడూ, ఎవ్వరూ, అతిక్రమించక పోవడంచేత, అలాగు నిర్లక్ష్యం చేసినవారికి ఎలాంటి శిక్ష విధింపబడేదో తెలుసుకోవడం అసాధ్యమే!

మహారాజులుంగారు కూడా - తమ కనిష్టమైన విష యాల్లో దివానుగారి ప్రవృత్తికి అడ్డు చెప్పలేకపోయేవారు!

* * *

దివానుగా రంటే తాబేదార్లందరికీ గొప్ప గౌరవం! ఈయన బెదరించేవాడే కాని, ఒకరి పొట్టమీద కొట్టడని అందరి ధైర్యమున్నూ. ప్రజలందరికీ దివానుగా రంటే దేవుడిలాంటివా రన్నమాట!

అంతేకాదు. ప్రభుత్వంవారికీ జగన్నాధరాజు చాలా నమ్మకస్థుడు. ఉత్తర సర్కారులలో వున్న జమీందారీ లన్నిట్లోకీ విజయనగరం జమీందారీయే చాలా పెద్దది; ధనవంతమయినది. అలాంటి జమీందారీ ఎటువంటి అల్లకల్లోలాలూ లేక సవ్యంగా జరుగుతున్నదంటే, దానికి దొరతనం కూడా గర్వించవలసినదే! దానికి కారణం దివాను జగన్నాధరాజుగారే అని పై దొరల కందరికీ బాగా తెలుసును.

మరో సంగతి ఏమిటంటే జగన్నాధ రాజుగారికి బాగా మెప్పు కావాలి. తన నేర్పునీ, ప్రతిభనీ నలుగురూ మెచ్చుకోవాలి! తన మాటకి ఎదురు ఉండకూడదు. అదే ఆయనకి కావలసినది! దివాంజీగారు ఇలాంటి ఆశయాలు కలిగి వుండడంచేత కొత్తగా ఏ పెద్ద ఉద్యోగి వచ్చాడని తెలిసినా, అతడిని తమ సంస్థానానికి పిలిపించి గొప్పగా గౌరవించి పంపేవారు. ఇలాంటి సమ్మానాలవల్ల చాలా ప్రయోజనాలు వుంటాయని చెప్పడంచేత మహారాజులుంగారూ అంగీకరించేవారు. ఈ విధంగా విజయనగరం దివానుగారికి గవర్నర్లతోటీ, కలెక్టర్లతోటీ చాలా పరిచయం కలిగింది. వారందరికీ ఈయనమీద గొప్ప గౌరవం ఏర్పడింది. అందువల్ల కల

క్టరు హోదాకి క్రింది వుద్యోగస్థులను దివానుగారు లక్ష్యం చేసేవారు కాదు. సబు కలక్టర్లు మొదలైన గవర్నమెంటు అధికార్లు కందరికీ జగన్నాథరాజుగారంటే చాలా భయంగా కూడా ఉండేది.

విశాఖపట్నం జిల్లాలోని రెవిన్యూ డివిజన్లలో ఒక డివిజనుకి విజయనగరం కార్యస్థానం. అందుచేత ఎవరో ఒక విదేశీయుడు ఆ వూరికి సబుకలెక్టరుగా వస్తూ వుంటాడు. ఆ వచ్చినవారిని దివానుగారు ఎదుర్కొని చాలా గౌరవం చూపించడం పరిపాటి.

ఒకసారి ఒక విదేశీయుడు అక్కడికి అధికారరీత్యా రావలసి వచ్చింది. దివానుగారు కాస్త అనారోగ్యంవల్ల ఆయన్ని ఎదుర్కొనలేక తన తరఫున అసిస్టెంటు దివానును పంపి, ఆ అతిథికి తగిన ఏర్పాట్లు చేయించారు. ఆ ఉద్యోగస్థునికి లోకానుభవం తక్కువ. అప్పుడే స్టీమరు దిగి వచ్చాడు.

హిందూదేశంలోనివాళ్ళందరూ అనాగరకులనీ, మూర్ఖులనీ అతని మనసులో ఇదివరకే ఒక దురభిప్రాయం ఏర్పడి ఉండిపోయింది. తాను ఒక తెల్ల దేవతామూర్తిననీ, తనకు అక్కడివారు అడుగులకు మడుగు లొత్తుతూ, ఎక్కువ వినయ విధేయతలు చూపించాలనీ అతని కోరిక. మొదట్లోనే తన్ను ఎదుర్కోడానికి పెద్ద దివాను రాకుండా చిన్న దివాను రావడం పెద్దగా అగౌరవపరచిన ట్లతనికి తోచింది.

నిజానికి ఆలోచిస్తే కలక్టరుకీ, సంస్థానానికీ ఎటువంటి సంబంధమూ లేదు. జమీందారీ వ్యవహారాల్లో అతను ఎలాంటి జోక్యమూ తీసికోనవసరం లేదు. అయినా తగు మనిషితరహాగా దివానుగారు మర్యాద చేస్తే అది చాలదని ఆ పాశ్చాత్యమూర్తి అనుకోవడంలో అర్థం లేదు.

వాడుక ప్రకారం ఆ కలక్టరుగారికి, రాజ దర్శనమూ జరిగింది, మరి రెండు మూడు రోజుల్లో. అతను దర్బారుకు వస్తున్నప్పుడు దివాను జగన్నాథరాజుగారు ఎదురుగా వచ్చి, సగౌరవంగా లోపలికి తీసుకొని వెళ్ళి మహారాజులుంగారి పరిచయం కలిగించారు.

మహారాజులుంగారు స్వయంగా వచ్చి తన్ను దర్బారులోకి తీసుకువెళ్ళడం లేదేమిటా? అని దొరగారికి కష్టం అనిపించింది. ఇదివరలో గవర్నర్లూ, పెద్ద కలక్టరూ వచ్చేటప్పుడు మహారాజులుంగారు స్వయంగా ఆహ్వానించటం జరిగేదని ఆ సబుకలక్టరు దొరగారికి తెలుసును. వాళ్ళకంటె తన తక్కువ యేమిటి? అని అనుకుని దీని కంతకీ కారణం దివానే అని మనస్సులో నిశ్చయించుకొన్నాడు.

తర్వాత ఒకటి, రెండు పర్యాయాలు కలుసుకున్నప్పుడు దివానును అలక్ష్యంగా చూసేడు. ఆ దొరగారి ప్రవర్తన జగన్నాథరాజుగారికి అసంతృప్తిని కలిగించింది. ఈ యిద్దరూ కూడా తగిన సమయానికి ఎదురుచూస్తూ వున్నారు.

* * *

జగన్నాథరాజుగారికి ఇంటిముందు పందిళ్లు వేయించు కోవడమంటే సరదా. ఏ వీధి భాగవతము జరిగినా, బొమ్మ లాట జరిగినా వాటికోసం ప్రత్యేకం పందిళ్ళు వేయించ నక్కరలేదనీ, పందిరి ఇంటికి శోభను కలిగిస్తుందనీ, నిత్య కల్యాణం కళ్ళకి కడుతూ వుంటుందనీ ఆయన అభి ప్రాయం. తాను హెడ్డు దివాను అయాక, కోటకి ప్రక్కగా సమీపంలోనే ఒక పెద్ద భవంతి ఆయన నివాసా నికి ఈయబడింది! తర్వాత దివాంజీగారు తమ కోరిక ప్రకారం తమ భవనంముందు శాశ్వతంగా వుండేటట్లు ఒక పందిరిని నిర్మించారు. అదే లక్క పందిరి.

లక్కపందిరి అంటే లాక్షాగృహం వలె లక్కతో నిర్మించబడ్డది కాదు. అది చాలా విశాలమైన పెంకుటింటి ఆకారం గల పందిరి. ఆ పందిరికి బలమైన కర్ర స్తంభాలు! ఆ స్తంభాలకి పైభాగంలో వున్న బల్లలమీద లక్క రంగు లతో రామాయణానికి సంబంధించిన బొమ్మలు మనోహ రంగా శాశ్వతంగా వుండేటట్టు చిత్రించబడి వున్నాయి. ఆ వీధిరోడ్డు ఆ పందిరిమధ్యనుంచే పోతున్నది. రెండు భారీ బళ్ళు నిరాఘాటంగా ఆ పందిరిలోంచి - ప్రయాణం చెయ్య వచ్చును!

ఒకసారి సబుకలెక్టరుదొరగారు కోట సింహద్వారం వైపునుంచి అయోధ్య మైదానంవైపు కోట రోడ్డుమీద నుంచి పోతూ వుండగా ఆయన దృష్టి ఆ ప్రక్క నున్న

దివాంజీగారి యింటి ముందున్న లక్క పందిరిమీద పడింది. వెంటనే అతని మనస్సులో ఒక ఆలోచన తట్టింది! ఆ కలెక్టరుదొర తన వాహనాన్ని ఆ పక్కకి మరల్చి దివాంజీగారి యింటివేపు వెళ్ళాడు.

దివాంజీగారప్పుడే ప్రాతఃకాల విధులు తీర్చుకుని కచేరి సావిడిలో సుఖాసీనులయి, ఏవో కాగితాలు చూచుకుంటూ గుమాస్తాలతో ఏదో మాటలాడుతున్నారు. ఇంతలో కలెక్టరుగారు లోపలికి వచ్చారు. జగన్నాథ రాజుగారు ఆయన్ని మర్యాదగా ఆహ్వానించి ఒక సోఫామీద కూర్చోపెట్టారు. కుశలప్రశ్నలు మామూలుగా జరిగిపోయాయి.

తర్వాత సబుకలెక్టరుగారందుకున్నారు—"నేను ఉదయం షికారుగా వస్తూ మీ యింటి ముందు పందిరి ఆకర్షింపగా ఇలా వచ్చాను. మీ పనికి ఆటంకం కలిగించినందుకు క్షమించండి."

'..............'

'దీన్ని మీరే కట్టించారనుకుంటాను. ఇలా తయారవడానికి చాలా ఖర్చు అయి వుండాలి!'

'చిత్తమండి! నేనే కట్టించాను, చాలా సొమ్ము ఖర్చుపెట్టి. ఇంతకీ మనస్సులోని కోరిక జరగాలంటే డబ్బుకి వెనకతీయగలమా?'

'సరే! బాగానే వుంది. ఈ వీధికి పోయే రోడ్డు ఈ

పందిరికిందనుంచే గదా వున్నది? వచ్చే పోయే బళ్లూ, మనుష్యులూ మీ పందిరిక్రిందనుంచేగదా వెళ్ళాలి?'

'అవును, నిరాఘాటంగా వెళ్ళవచ్చు. దానికి మా అభ్యంతరం ఏమీ లేదు. బళ్ళు ఎదురెదురుగా వచ్చినా ఇందులో సునాయాసంగా తప్పుకో గలవు. వర్షం పడే సమయంలో దీనికింద చాలామంది జనం తలలు దాచుకుంటున్నారు. ఇది జనానికి చాలా ఉపయోగంగా వుంది.'

'ఉండవచ్చును గాక! పబ్లికు రోడ్డుమీద మీ రిలా శాశ్వతంగా పందిరి కట్టించి వుంచడం పద్ధతికి విరుద్ధ మేమో ఆలోచించారా?'

జగన్నాథరాజుగారికి కలక్టరు అభిప్రాయం ఇప్పుడు అవగతమైంది. కలక్టరుకి తమ సంస్థానంమీదా, తమ మీదా ఎలాటి అధికారమూ లేకపోయినా ప్రజా సంస్థమీద అధికారం వుంది. నగర పరిపాలనాధికారం ప్రభుత్వముది కాని, సంస్థానంవారిది కాదు. తన్ను సాధించడానికి కలక్టరు ఈ అధికారాన్ని ఉపయోగించదలచినాడని దివానుగారికి బాగా అర్థమయింది. అర నిమిషం ఆలోచించి ఆయన ఇలా అన్నాడు:

'ఇది చాలా కాలంక్రిందటే కట్టబడి వుంది. ఇదివరకు తమవంటి ప్రభువులూ, గవర్నరులూ దీన్ని చూచినారు; వారు ఎటువంటి ఆక్షేపణా చెయ్యలేదు.'

'ఆ సంగతి వేరు! ఎప్పుడో తప్పు జరిగిందని, తమ

వంటివారు దాన్ని సరిదిద్దుకోకుండా అలాగే వుంచి వేయడం ధర్మమా?'

దివాంజీగారి మనస్సు ఉడికిపోతోంది. కోపంచేత ముఖం కందగడ్డవలె ఎర్రబారిపోయింది. తనకు ఎదురు చెప్పేవాడొకడు ఇప్పుడు కనబడడమూ, తన్ను అవమానించడమూ దుస్సహం అనిపించింది ఆయనకి. అయినా ఆలోచించి శాంతం వహించవలసి వచ్చింది.

'అయితే ఏమి సెలవు?'

'మరేమీ లేదు; దీన్ని తీసివేయించాలి.'

జగన్నాథరాజుగారికి తలకొట్టినట్లనిపించింది; ఆయనకు ఏమి జవాబు చెప్పడానికీ పాలుపోలేదు.

కలక్టరు అధికార గర్వంతో తన విజయాన్ని సూచిస్తూ 'తీసివేయించక తప్పదు. సాయంకాలం లోగానే ఆ పని జరిగి తీరాలి!' అన్నాడు.

జగన్నాథరాజుగారికి ఏదో మనస్సులో మెరుపు మెరిసినట్లయింది. ఆయన 'సరే! తీయించివేస్తాను, సాయంకాలం లోగానే' అన్నారు.

'మీరు వెంటనే యీ పనికి మనుష్యులను ఏర్పాటు చెయ్యాలి. నేను సాయంకాలం మళ్ళీ తమ దర్శనం చేసుకుంటాను.'

'ఓ! జగన్నాథరాజు ఇన్ని మాటలు ఆడేవాడు కాడు. సాయంకాలంలోగా తప్పకుండా తీయించివేస్తాను! నామాట

నమ్మండి.'

కలక్టరు వికసితవదనంతో వెళ్ళిపోయాడు. దివాంజీగారు తాను ఒంటరిగా కొన్ని కాగితాలు వ్రాసుకోవడానికి తన ప్రత్యేకపు గదిలోనికి వెళ్ళిపోయారు.

సాయంకాలం కావచ్చినది. లక్క-పందిరి చెక్కు-చెదరకుండా అలాగే వుంది. దాన్ని తీసివేయించడానికి ఎలాంటి ప్రయత్నమూ జరిగినట్టన్నా లేదు.

కలెక్టరుగారు తన ఆజ్ఞ ఎంతవరకు నెరవేర్పబడిందా అని చూడడానికి దివాంజీగారి యింటివేపు వచ్చారు. లక్క-పందిరిని చూసేసరికి అది తన్ను వెక్కి-రిస్తున్నట్లు కనబడింది!

అతను మిక్కి-లి కోపంతో దివానుగారి యింటిగుమ్మం దగ్గిరికి వచ్చాడు. జగన్నాధరాజుగారు చిరునవ్వుతో స్వాగతం యిచ్చి లోపలికి తీసుకువెళ్లాడు.

కలెక్టరుగారు: 'దివాంజీగారూ! నాకు చాలా విచారంగా వుంది; నా ఆజ్ఞ నెరవేరలేనందుకు నేను తగిన చర్య తీసుకోవలసి వస్తున్నది' అన్నారు.

దివాంజీగారు ఒక ఎర్ర కాగితం కలెక్టరుగారి చేతికి అందిస్తూ నవ్వుతూ అన్నారు—'చిత్తం! తమ ఆజ్ఞ నెరవేర్చడ మనేది మాకూ చాలా ముఖ్యమే! కానైతే, తమపై అధికారుల మాటప్రకారం జరిగించవలసి వచ్చినందుకు క్షమించాలని ప్రార్థన' అని.

ఆ యెర్ర కాగితం గవర్నరుగారి వద్దనుంచి వచ్చిన

అర్జెంటు టెలిగ్రాము! అందులో 'మీ యింటి లక్క పంది రిని ఎంతమాత్రమూ తీయించవలసిన అవసరం లేదు' అని వున్నది.

దాన్ని చూస్తూ దొరగారు నిర్ఘాంతపడిపోయారు!

ఇంతలోనే కలెక్టరుగారి యింటి ప్యూనొకడు ఆయన కోసం ఒక ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాము పట్టుకొని అక్కడికి వచ్చి వినయ పూర్వకంగా తన యజమానికి దాన్ని సమర్పించాడు.

కలెక్టరుగారు దాన్ని ఆతురతతో విప్పి చదువు కున్నారు. అది గవర్నరుగారి వద్దనుంచి వచ్చినదే!

'ఉత్తర క్షణంలో శిరస్తాదారుకి ఛార్జి అప్పగించి, రసూల్ కొండకు పోయి ఛార్జి తీసుకోవలసింది. అక్కడ చార్జి తీసుకున్నట్లు రెండురోజుల లోగా మాకు తెలియ పరచాలి' అని ఆ టెలిగ్రాములో వుంది.

అది మనసులో చదువుకుంటూ సబుకలెక్టరు దొర గారు వెలవెలపోయారు.

అందులో విషయం ఆయన రహస్యంగా వుంచాడేకాని, అతని ముఖ వికాసం దాన్ని తెలియ చేసింది. అందులో వుండే విషయమేమో దివానుగారికి ఇదివరకే తెలుసును. గవర్నరుగారు ఆయనకి యీ సంగతి తెలియజేశారు.

జగన్నాథరాజుగారు కోరినదీ కలెక్టరుగారి బదిలీనే! అంతకంటే ఎక్కువ అపకారం చేయడం ఆయన స్వభావానికి విరుద్ధం.

దివాంజీగారు ఊరుకోలేదు.

'అయినా నా మాట నేను నెరవేర్చుకున్నట్లే జరిగింది.'

ఏమీ అర్థం కానట్లుగా కలెక్టరు చూశాడు.

'సాయంకాలం లోపుగా తీయించివేస్తానని అన్నాను గదా! అన్న మాటప్రకారం తీయించివేశానా? లేదా?' అని జగన్నాధరాజుగారు చాలా ధీమాగా అన్నారు.

సబుకలక్టరు దొరగారి ముఖంలో గంటు పెట్టినా నెత్తురుచుక్క లేదు.

---

# 6. కంట్రాక్టరు సోమన్న

దివాను జగన్నాథరాజుగారు తన దగ్గర నున్న కాగితా లను చూచుకుంటూనే, ఎదుట కొంచెం దూరంలో చేతులు కట్టుకుని నించుని వున్న దరఖాస్తుదారుని మనవిని వింటూ వున్నారు.

'మహాప్రభువులు కరుణించాలి! చాలా బీదబ్రాహ్మ డిని. పెద్ద కుటుంబం. ఏ ఆధారమూ లేదండి, ప్రభువుల అనుగ్రహంతప్ప! ఏదన్నా వుద్యోగం యిప్పించి, యీ కుటుంబాన్ని పోషించాలని ప్రార్థన.'

అని ఎదుట నించుని వున్న సోమనాథం వినయ విధేయ తలతో మనవి చేశాడు.

దివాను సోమనాథంవైపు దృష్టి మరల్చి 'ఏమయినా ఖాళీలుంటే నువ్వింత బతిమాల నక్కర్లేదయ్యా! మా సంస్థానం పనీ జరగవలసిందేగా! అయితే నేమీ? ఇప్పుడే మిస్నీ ఖాళీలు లేవు' అని అన్నాడు.

సోమనాథం చేతులు నులుపుకుంటూ 'చిత్తం, చిత్తం! ప్రభువులు తలుచుకుంటే ఏ ఖాళీ అన్నా వస్తుంది. ఈ బీదకుటుంబం వొక్కటి పోషించడం ప్రభువులకి ఒక లెక్కలోది కాదు' అన్నాడు.

దివాను నిదానించి చూస్తూ 'నీ గోడు నువ్వు చెప్పడం

సబబుగానే వుంది. కాని నేను తలుచుకుంటే యే ఖాళీ అయినా వస్తుందనడం సరిగా లేదు. నీకు ఖాళీ కావాలంటే ఎవర్నయినా బర్తరఫు చెయ్యాలన్నమాట! నీ లాంటి బీద వాడి కుటుంబంపొట్టమీద కొట్టాలన్న మాట కదూ! విజయ నగరం సంస్థానంలో అలాంటి పని యెన్నటికిన్నీ జరగదు' అన్నాడు.

సోమనాథం గడగడలాడిపోయాడు.

"చిత్తం, చిత్తం! మరొకరిని బర్తరఫుచేసి, ఆ పని నా కిప్పించాలని నేను కోరలేదు ప్రభూ! సర్వేజనా స్సుఖినో భవంతు! ధర్మ సంస్థానం అయిన ప్రభువుల సంస్థానంలో అలాంటిపని యెన్నటికిన్నీ జరగదని తెలుసును ప్రభూ! తమరు తలిస్తే ఏదో ఒకపని కల్పింపగలరనీ, ధర్మసంస్థానం-ఒక బీద కుటుంబం మలమల మాడిపోతూ వుంటే చూస్తూ ఊరుకోదనీ ధైర్యంతో అలా అన్నాను ప్రభూ!"

జగన్నాథరాజుగారు కొంచెం ఆలోచనలో పడ్డారు.

'ప్రస్తుతం యేమీ ఖాయంగావుండే నౌకరీలు లేవు. అయినా, ఆలోచిస్తాం! నువ్వు ఏమి చేయగలవో చెప్పు.'

'చిత్తం, చిత్తం. నేను కొంతకాలం వక కోమటి గుమాస్తాగా పనిచేశాను. చిరా. ఆవర్జాలు బాగా వ్రాయ గలను. ఎలాంటి లెక్కనయినా సులభంగా చేస్తాను. తిక మకల్లో వున్న లెక్కలను శీఘ్రంగా చిక్కు విడదీయగలను. ఆ కోమటి, తన కుమారుడికి తరిఫీదు ఇమ్మని చెప్పి, వాడు

అన్నీ బాగా గ్రహించాక నాకు ఉన్నపాటున ఉద్వాసన చెప్పాడండీ!'

'ఏమయినా ఇళ్లు కట్టించే అనుభవం వుందా? ఏ పని వాళ్లకి ఎంత యిస్తే గిట్టుబడి అవుతుందో-పని లోటూ, లొసుగూ లేకుండా జరుగుతుందో తెలుసా?'

'చిత్తం, చిత్తం. బాగా తెలుసునండి. మా సెట్టి గారు కట్టించిన భవంతిపని నా చేతిమీదుగానే జరిగిందండి! అణా, పైసలుతో కూడా లెక్కలు సమంగా అప్పగించే వాడిని. ఆయన చాలా సంతోషించి వక పట్టుశాలీ పంచెల చాపు బహుమానంగా యిచ్చారండి. పని పసందుగా వుం దంటూ కితాబు యిచ్చారండి.'

''సరే! యిప్పుడు సంస్థానంవారు భీముని పట్నంలో సముద్రపువొడ్డున ఒక పెద్ద బంగళా కట్టించదలచుకుని వున్నారు. ఆ పని చేయించే పూచీ పడితే నీకు అప్పగిస్తాను. కావలసిన వస్తువులూ, కలపా మొదలయినవి తగిన ఖరీదుకి సులభంగా సప్లయి అయేటట్లు మేం తాఖీదులు యిస్తాం. ఆరునెలలు దాటకుండా బంగళా పసందుగా తయారు కావాలి.''

''చిత్తం, చిత్తం, తప్పకుండా తమ ఆజ్ఞ నెర వేరుస్తానండి, ప్రభువులు మెచ్చుకునేటట్లు చేయిస్తాను.''

''నువ్వు ఆరు నెలలపాటు ఆ పనిని చూడవలసి వుంటుంది. అహోరాత్రాలు దానిమీద నే కన్ను వుంచాలి.

ఏభయి వేలు దాటకుండా అయేటట్లు చూడాలి. ఇది నీకు నచ్చినట్లయితే రేపట్నుంచే పని ప్రారంభించవచ్చు''

''చిత్తం, చిత్తం. ప్రభువుల ఆజ్ఞకి వ్యతిరేకంగా చెప్పడానికి ఎవరికి సాధ్యమండి; ఏలినవారికి ఎలాతోస్తే అలా ఆజ్ఞాపించవచ్చు.''

''సరే! సాయంకాలం కనపడు; అక్కడి ఠాణేదారుకి తాఖీదు వ్రాయించి ఉంచుతాము. నువ్వు అడిగినప్పుడల్లా అవసరమైనంత సొమ్ము అతను నీకు ఇస్తూ వుంటాడు. అక్కడి నౌకర్లు కూడా నీకు సహాయంగా ఉండేటట్లు ఏర్పాటు చేయిస్తాము.''

* * *

భీముని పట్నంలో విజయనగరం మహారాజావారి బంగళాపని సోమనాథం యాజమాన్యం కింద చాలా చురుకుగా జరుగుతున్నది.

సోమన్న—అంటే—సోమనాథం తన కుటుంబంతో కూడా భీముని పట్నంవచ్చి ఒక చిన్నయిల్లు అద్దెకు నిర్ణయించుకొని కాపురం పెట్టాడు.

రమారమి రెండు నెలలు గడచాయి.

సోమన్న యిలా శ్రద్ధగా పని చేయిస్తున్నాడు.

దివానుగారి ఆజ్ఞ ప్రకారం అతడు పనికి కుదురుకున్నాడు; కాని ఈ పనివల్ల తన కేటువంటి లాభమో అతనికి తెలియదు. ఇంత జీతం యిస్తామని దివానుగారూ సెల

విద్య లేదు ; ఇంత ఇయ్యాలంటూ సోమన్నా అడగలేదు.

రెండు నెలలు కావచ్చినా ఒక నెల జీతమయినా అందక చాలా ఇబ్బందిపడుతున్నాది ఆ బీద కుటుంబం! బంగళా పని నిమిత్తం సోమన్న చేతిలో వేలకొద్దీ డబ్బు ఆడుతూ వుండేది. కాని అందులోంచి ఒక దమ్మిడీకూడా అతను ముట్టడు. అలా తీసికోవడం ద్రోహం చేసినట్లని అతని భావన.

రెండు నెలల జీతమూ ఒక్కసారిగా వస్తుందనీ, ఆ విషయమై దివానుగారికి యాదాస్తు పంపడం మర్యాద కాదనీ సోమన్న అనుకున్నాడు. కుటుంబం అవసరాలకోసం చిల్లర అప్పులు చెయ్యవలసి వచ్చింది.

రోజులపైని రోజులూ, వారాలమీద వారాలూ, నెలలమీద నెలలూ గడచిపోతున్నాయి. బంగళాపని చాలా చురుకుగానే జరిగిపోతున్నాది. కాని సోమన్నకు మాత్రం జీతంలో వక దమ్మిడీ కూడా అందలేదు.

అతను మనస్సులో చాలా కష్టపడ్డాడు. అయినా ఎవ్వరితోటీ యీ సంగతి చెప్పడం లేదు. బంగళా పూర్తి అయాక మొత్తమ్మీద సొమ్మంతా ఒక్కసారిగా ఇవ్వవచ్చని అనుకున్నాడు.

నిత్యఖర్చులకోసం అతను తన దర్భముడి ఉంగరాన్నే కాకుండా, భార్య మెడలోని మంగళసూత్రాల దగ్గరనుంచీ అమ్మవలసి వచ్చింది. ఆ యిల్లాలు పసుపుకొమ్ము మెడలో

కట్టుకోవలసి వచ్చింది.

*     *     *

బంగళా పసందుగా తయారయింది.

ఈ సంగతి సోమన్న దివాన్‌జీ సాహేబు వారికి తెలియజేశాడు.

అయిదు నెలలకే అంత పెద్ద బంగళా పూర్తికావడం దివానుగారికి చాలా సంతోషం కలిగించింది.

ఆ మర్నాడే ఆయన బంగళాను చూడడంకోసం భీమునిపట్నం వచ్చారు.

సోమనాథం దివానుగారిని బంగళా నాలుగు మూాలలకీ తీసుకుని వెళ్ళి, తాను ఏ విధంగా ఏ పని చేయించినదీ వివరించి చెప్పాడు.

దివానుగారు మనస్సులో చాలా సంతోషించినా, బయటికి ఏమిన్నీ ఉబకడం లేదు.

అమాం బాపతులు ఎంత అయిందీ ఆయన సోమన్నను అడగనూ లేదు; సోమన్న తనంతట చెప్పడానికన్నా ఆయన అవకాశమూ యియ్యలేదు.

రెండు మూడు రోజుల్లో లెక్కలతోపాటు విజయనగరం రావలసిందంటూ ఆయన తాఖీదు మాత్రం యిచ్చాడు.

తన జీతం సంగతి యేమిన్నీ ఎత్తుకోనన్నా లేదు.

అది సోమన్నకి చాలా కష్టం అనిపించింది.

విజయనగరం వెళ్ళినమీదట తన సంగతంతా మనవి చేద్దామని మనస్సులో నిశ్చయించుకున్నాడు.

దివానుగారు వెళ్ళిపోయారు.

ఆయన ముభావం సోమనాధానికే కాకుండా, అతని మీద అభిమానం వున్న మరికొంతమందికి కూడా కష్టమని అనిపించింది.

అప్పటి కప్పుడే ఆ వూరిలో కొన్ని వదంతులు పుట్టి నాలుగు మూలలకీ అల్లుకున్నాయి.

సోమనాథం తగిన మర్యాదలు జరపడం లేదనీ, అందు కనే దివానుగారు ముభావంగా వున్నారనీ కొందరనుకున్నారు.

బంగళాపని ఆయనకు సుతరామూ నచ్చలేదనీ, అందు కోసమే తగిన సంజాయిషీ యివ్వడానికి విజయనగరం రావా లంటూ తాఖీదు చేశారనీ మరో పక్షంవారి అభిప్రాయం.

సోమనాథం చాలా డబ్బు కాజేశాడని దివానుగారి అనుమానమనీ, అందుకోసమే లెక్కలతో హాజరు కావాలని అన్నారనీ మరికొందరి ఊహాగానం.

ఇవన్నీ సోమనాథం చెవి సోకినాయి. అతని ధైర్యం కొంత సడలింది. మనస్సు పరి పరి విధాల పోయింది. ఏమి నిశ్చయించుకొనడానికీ సాధ్యం కాలేదు. ఇంతకూ తనకు రావలసిన జీతము రాదేమో అనే పెద్ద అనుమానం అతని మనస్సులో ప్రవేశించింది.

తానూ, తన కుటుంబమూ మల మల మాడుతూ,

ఎంతో విశ్వాసంతో పనిచేస్తే వచ్చిన ప్రతిఫలం యిదా? అంటూ మనస్సులో సోమనాథం క్రుంగిపోయాడు.

*　　　*　　　*

సోమనాథం జంకుతూ, జంకుతూ దివాంజీవారి కచేరీ సావిట్లో ప్రవేశించాడు.

అక్కడ దివానుగా రొక్కరే ఏవో కాగితాలు చూసుకుంటున్నారు.

సోమనాథాన్ని చూసి, అతను వణకుతూవున్న చేతులతో చేసిన నమస్కారాన్ని అందుకుని, కూచోమని సంజ్ఞ చేశా రాయన.

కాని సోమనాథం కూర్చోకుండా నిలిచియే ఉండి, దివానుగారి నోటినుంచి ఏ వాక్యాలు వెలువడతాయో విన డానికి సిద్ధంగా వున్నాడు.

దివానుగారు సోమనాథంవేపు నిదానించి చూశారు. ఇన్నాళ్ళనుంచీ అతను పడుతూ వుండిన శ్రమ అతనిలో మూర్తీభవించి వుంది; చాలా చిక్కిపోయాడు కూడాను.

అతని ముఖంమీద నిరాశ తాండవిస్తున్నది.

దివాను జగన్నాథరాజుగారు సంగతంతా గ్రహించారు. ఇదివరకు కూడా ఇతరులవల్ల-సోమనాథం స్థితిగతులన్నీ విని వున్నారు.

'సోమనాథం! ఆ లెక్కల కాగితాలు యిలా ఇచ్చి నువ్వు ఆ బెంచీమీద కూచుని, కాస్త విశ్రాంతి తీసుకో.'

'చిత్తం, చిత్తం' అంటూ సోమన్న కాగితాలు అందించి, జంకుతూ బెంచీమీద కూలబడ్డాడు.

ఆ లెక్కలు చూసి దివానుగా రాశ్చర్య పడ్డారు! ఏభయివేల పై చిలుకు ఖర్చు కాగల దనుకున్న బంగళా పాతిక వేలతోటే తయారయినట్లు లెక్కలు స్పష్టంగా కన బడుతున్నాయి.

'సోమనాథం! బంగళా ఎంతలో కావాలని మొదట చెప్పి వున్నామో జ్ఞాపకం వుందా ?'

'చిత్తం, చిత్తం, యాభై వేలన్నట్లు గుర్తు.'

'అయితే యీ లెక్కలేమిటి, పిచ్చి బ్రాహ్మణుడా?'

అంటూ ఆయన ఆ కాగితాలన్నిటినీ పర్రుమని చింపి వేశారు!

సోమనాథానికి దేమీ అర్థం కాలేదు.

'నువ్వు బంగళాను చాలా బాగా కట్టించినందుకు చాలా సంతోషిస్తున్నాం. యాభై వేలు ఖర్చుపెట్టినా, అలా ఎవ్వరూ కట్టించలేరు.'

'చిత్తం, చిత్తం. అది ఏలినవారి కటాక్షం.'

'నువ్వు చాదస్తపు బ్రాహ్మడవగుటచేత యిలా పిచ్చి పిచ్చిగా లెక్కలు వేశావు. మరొకరైతే యాభై వేలకీ కిట్టించి వుందురు.'

సోమనాథం ఏమీ మాటలాడలేదు.

'నువ్వు వక దమ్మిడీ అయినా తీసుకోకుండా నానా

కష్టాలూపడి కాలం గడిపావు. మేము జీతం యేదైనా యేర్పాటు చేసి వుంటామని భ్రాంతిపడి వుంటావు. ఇలాంటి వాటికి జీతం పద్ధతి ఏర్పాటులో లేదు.'

సోమనాథం నిలువునా నీరయిపోయినాడు. దివాను ఏమి అంటున్నదీ అతనికి అర్థం కాలేదు.

'అయినా, నువ్వు నిరుత్సాహపడవద్దు. ఇలా పని చేయించినందుకు నీకు తగిన ప్రతిఫలమే ముడుతుంది. యాభై వేల పనిని పాతిక వేలలో ముగించి, సంస్థానంవారికి లాభం చూపించినందుకు నీకు అయిదు వేలు కట్నంగా యిస్తున్నాము.'

సోమనాథం ఆనందం పట్టలేకపోయాడు.

'నిజమే? నిజమే?' అని అతని నోటినుంచి అప్రయత్నంగా రెండు మాటలు వెలువడ్డాయి.

'నిజమే! ఇందులో అబద్ధం యేమీ లేదు. నువ్వు కంట్రాక్టరువనుకో! నీకు యీ బంగళా కట్టించడానికి ముప్పయి వేలకి గుత్తకిచ్చినా మనుకో. నువ్వెంత ఖర్చుపెట్టినదీ మా కవసరంలేదు. మా కోరిన పని పసందుగా ఉండడమే మాకు కావాలి. నువ్వు పాతిక వేలే ఖర్చుచేస్తే-మిగిలిన అయిదు వేలూ నీకు లాభం అన్నమాట!'

సోమనాథం ఏమో చెప్పబోయాడు.

'నువ్వు మరి మాటాడకు. నీవంటి చాదస్తుడిని నేనెక్కడా చూడలేదు. రేపు పొద్దున్న ముప్పయి వేలకి

లెక్కలు కిట్టించి రాసుకుని తీసుకురా. ముప్పయి వేలకి నీకు కంట్రాక్టుకు ఇచ్చినట్లు వ్రాసి ఉన్న యీ ఎగ్రిమెంటుమీద నువ్వు సంతకం చేస్తూ—నువ్వు పని ప్రారంభించిన తేదీ వెయ్యి. రేపు పొద్దున్న వచ్చి, ఆ కాగితాలు ఇచ్చి అయిదు వేలూ తీసుకొని వెళ్లు.

సోమనాథం కృతజ్ఞతతో 'చిత్తం, చిత్తం. ఇలా జరుగుతుందని కలలో కూడా అనుకో లేదండి ప్రభూ!' అని మనవి చేశాడు.

'ఇంతే కాదు. నీకు రేపటినుంచీ యింజనీరింగుడిపార్టు మెంటులో నెలకు నలభై రూపాయీలమీద వుద్యోగం ఇవ్వ డానికి యేర్పాటు చేయబడింది.'

సోమనాథం ఆనందంతో ఆకాశం అందుకున్నాడు.

---

# 7. కోరిక

ఒకప్పుడు విజయనగర ప్రభువైన ఆనంద గజపతి మహా రాజులుంగారు దివాను జగన్నాధరాజుగారితో యిష్టా గోష్ఠి జరుపుతూ వుండగా భక్తులను గురించిన ప్రశంస వచ్చింది. భక్తుల్లో నియమ నిష్ఠలు కలవాడు, మహా త్యాగి అయిన రుక్మాంగద చక్రవర్తిని యిద్దరూ మెచ్చుకున్నారు.

'చూశారా? నియమమూ, భక్తీ, త్యాగమూ అంటే అలా వుండాలి. ఎలాంటి విషమపరిస్థితులు వచ్చినా, ఆ మహానుభావుడు ఏకాదశీ వ్రతం మానాడా?' అన్నారు మహారాజులుంగారు.

'చిత్తం, చిత్తం. ఆ కాలంలో అలాంటి పట్టుదలా వుండేది. భగవంతుడికి అనుగ్రహమూ కలిగేది' అన్నాడు దివాను.

'చూడండీ! నేనీ ఏకాదశినాడు శుష్కోపవాసం ఉండదలచుకున్నాను. ఇది ఉత్థాన ఏకాదశి; విశేషం కూడాను. క్షీరాబ్ధి ద్వాదశినాడు తెల్లవారేసరికే పారణ చెయ్యవచ్చు. రెండువేల బ్రాహ్మణ్యానికి ఆ సమయానికే మన కందాలో సమారాధన ఏర్పాటు చెయ్యండి. అది దివ్యంగా జరగాలి.'

దివాను చేతులు నులుపుకుంటూ 'చిత్తం, చిత్తం!'

ప్రభువులు ఆజ్ఞాపించినట్లు సమారాధనకి తగిన యేర్పాట్లు చేయిస్తాను. కాని ప్రభువుల కెప్పుడూ అలవాటు లేనందున ఉపవాసం చెయ్యట మనేది ఉచితం కాదేమో అని తోస్తుంది' అన్నాడు.

'చేసుకుంటే సరి; ప్రతిదీ అలవాటు అవుతుంది. ఒక సారయినా వుపవాసం వుంటేనేగాని, దానిలోని కష్టసుఖాలు ఎలా తెలుస్తాయి? మరో సంగతి. ఆ మహాత్ముడు యావజ్జీవమూ తప్పకుండా ప్రతి ఏకాదశీ వుపవాసం వుంటూ వుండగా, నేను ఒక్క ఏకాదశినాడయినా వుపవాసం వుండడం భావ్యం కాదా? ఏమయినా సరే! నేను వుపవాసం వుండా లనే నిశ్చయించుకున్నాను' అన్నారు మహారాజులుంగారు.

దివాను 'అయితే మంచిదే! రుక్మాంగదులవారితో పాటు ఊళ్ళో ప్రజ లంతా ఉపవాసం ఉండేవారట! ప్రభువులతోపాటు మావంటి భృత్యులం కూడా ఉండడానికి సిద్ధం!' అన్నాడు. మహారాజులుంగా రది విని చిరునవ్వు నవ్వి వూరుకున్నారు.

దివాను సెలవు తీసుకుని వెళ్ళి సమారాధనకి తగిన యేర్పాట్లు చేయించసాగాడు.

*　　　*　　　*

సమారాధనకోసం యేర్పాట్లు జోరుగా జరుగుతున్నాయి. మహారాజులుంగారు ఉపవాసం ఉండడం చూచి, ఆయన దయను కాంక్షించే ఉద్యోగస్తు లందరూ ఉపవాసం

వున్నారు.

క్షీరాబ్ధి ద్వాదశినాడు తెల్లవారే సరికల్లా పిండి వంటలతో సహా పదార్థాలన్నీ సిద్ధం కావాలి. అందుకోసం తగిన పాచకులను పిలిపించి, తెల్లవారు ఝాము మూడుగంటలకే హొయ్యి రాజవెయ్యడానికి ఏర్పాట్లు జరిగాయి. మహారాజులుంగారు కూడా బ్రాహ్మణ భోజనానంతరం అక్కడే పారణ చెయ్యడానికి నిశ్చయించుకున్నందున అన్నీ మంచి పాకంలో పడేలాగు చూడాలి. అందుకోసం ఆ చుట్టుపట్ల పాక కళలో పేరు మోగిన బాపన్నావధానిగారినీ, ఆయన సహచరులనూ ఈ పనికి నియోగించారు. కాని బాపన్నగారికి యేదో అశౌచం రావడంవల్ల ఆయన రాలేనట్టుగా యేకాదశి ఉదయానికే దివానుగారికి వార్త వచ్చింది.

దివానుకు ఏమి చెయ్యడానికీ తోచలేదు. తన ప్రయత్నం అంతా చివరికి రసాభాసగా తయారవుతుందేమో అని ఆయనకి జంకు కలిగింది. ఆయన వెంటనే వాకబు చేయగా ఆ చుట్టుపట్ల సమర్థుడైన పాచకుడు లేడనీ, అనకాపల్లిలో మాత్రం బాపన్నగారికన్న కూడా సమర్థుడు భీమావధానులుగా రున్నారనీ తెలిసింది. వెంటనే దివానుగారు అక్కడికి ఒక మనిషిని పంప దలచారు.

అనకాపల్లి విజయనగరానికి చాలా దూరంగా వున్న పట్నం! మామూలుగా నడిచి వెళ్ళాలంటే రెండు రోజులు పడుతుంది. మొయిలుమీద వెళ్ళితే మూడుగంటలకి గాని

అనకాపల్లి చేరడం కష్టం! కాని ఆ కాలంలో మహారాజుల దగ్గర గంటకు ఇరవై పాతిక మైళ్ళు అవలీలగా పరుగెత్తి పోగల మనుష్యులు వుండేవారు. అలాంటి మనిషిని పంపితే పన్నెండు, ఒంటిగంట కల్లా జవాబు తేగలడు. అందువల్ల అట్టి జంఘాలుడిని ఒకనిని దివానుగారు అనకాపల్లి పంపారు. ఎంత రాత్రికైనా సరే. భీమావధాన్లు గారిని తీసుకువచ్చి తీరాలని ఆజ్ఞాపించారు! అప్పుడు ఆఖరు రైలుబండి రాత్రి పదకొండు గంటలకి వుండేదిలెండి!

మనిషి పన్నెండుగంటల లోపునే అనకాపల్లి చేరుకున్నాడు. అవధాన్లుగారి బసను సులభంగా కనుక్కోగలిగాడు. కాని, ఏం లాభం? ఆయన వూళ్లో లేరు. గత దినమే ఆయన బంధువుల యింటికి భీమునిపట్నం వెళ్లినారని ఆయన భార్య తెలియజేసింది.

జంఘాలుడి నడుం నటుక్కుమన్నది. ఇంత శ్రమ పడి వస్తే భీమన్నగారు ఇంట్లో లేకపోయారు...'లే'రనే వార్త దివానుగారి చెవిని వెయ్యడం అతనికి ఇష్టం లేదు. 'ఎలాగన్నా సరే, భీమన్నగారిని విజయనగరం తీసుకువెళ్ళాలి; ఆయన యెక్కడుంటే అక్కడికే వెళ్ళాలి; తప్పదు' అని నిశ్చయం చేసుకుని, ఎంత బాధ అనిపించినా లెక్క చెయ్యకుండా సరాసరి భీముని పట్నం పొద్దు గ్రుంకకుండానే చేరుకున్నాడు. అదృష్టవశాత్తూ భీమన్నగారు అక్కడినుంచి మరియే వూరూ వెళ్ళనందున బంధువుల యింటిలో దొరికారు.

దివానుగారి మనిషి విషయం అంతా పూస గ్రుచ్చి నట్లు మనవిచేసి, ఎంత రాత్రికైనా సరే, విజయనగరం రాక తప్పదనీ, వస్తే మహారాజావారికీ, దివాన్‌జీ వారికీ గొప్ప అనుగ్రహం కలుగుతుందనీ, రాకపోతే వారి ఆగ్ర హానికి పాత్రులు కాగలరనీ తెలియజేశాడు.

అప్పుడు జనం యింత తెలివిమీరి వుండి పోలేదు. ప్రభువుల పోష్యవర్గంలో లేకపోయినా, అందరికీ మహారాజు గారంటే భక్తి శ్రద్ధలూ, భయమూ వుండేవి. సంస్థానం నుంచి ఏ తాబేదారు వచ్చినా, అణగి, మణగి, ఆజ్ఞలు నెర వేర్చేవారు. ఇంతకూ యిది తప్పనిసరి అయింది: మరో నాడు చూచుకోవచ్చు ననేది కాదు.

భీమావధానులు గారు రెండు నిమిషాలసేపు ఆలో చించి 'సరే! సమయానికి వస్తానని మనవిచెయ్యి' అనిచెప్పి, ఆ మనిషిని పంపివేశాడు. ఆ మనిషి కూడా ఏదున్నరకల్లా విజయనగరం చేరుకుని దివాన్‌జీ గారిని దర్శించి తాను భీమన్నగారిని ఎలా ఎక్కడ కలుసుకున్నదీ, ఎలా ఒప్పించి నదీ మనవిచేసి, పారితోషికం పుచ్చుకుని ఇంటికి వెళ్ళాడు.

* * *

ఆనంద గజపతి ప్రభువు ఏకాదశికి కటిక ఉపవాసం ఉన్నట్లు, తెల్లవారేసరికల్లా రెండువేల బ్రాహ్మణ్యానికి సమారాధన జరిపిస్తూ వున్నట్లు అది తన చేతిమీదుగా జరగవలసినట్లూ విని భీమావధానులు పొంగిపొయ్యాడు.

పాకక్రియలో తనకు అడ్డు లేదు. ఎడమ చేతితో ఆయా సంభార ద్రవ్యాలని విసిరి పారవేసినా, పదార్థాలు అమృత సమానంగా తయారు కాగలవని అతని ధైర్యం! రాత్రి భోజనం చేశాక ఒక అంగవస్త్రంతోనూ, పై బట్టతోనూ—చేతిలో ఒక దుడ్డుకర్ర ధరించి కాలినడకను విజయనగరం ప్రయాణమయ్యాడు. రాత్రి ప్రయాణం చెయ్యడం ఆయన కలవాటే! గొప్ప ధైర్యశాలి కావడంచేత దొంగలన్నా, జంతువులన్నా అణుమాత్రమూ భయం లేదు,

ప్రయాణం సాగిస్తూ ఆలోచించాడు — ఆయన: "మహారాజులుంగారు కోరినట్లు సూర్యోదయానికల్లా అన్నీ తయారు కావడమూ, ఆయనకు సంతోషం కూర్చడమూ నిశ్చయం! ఆయన ఆనందించి "ఏం కావాలి?" అని అడుగుతారు. ఏమిటి కోరడం? ఎంతో గౌరవంగా పిలిపించిన ప్రభువులను డబ్బు కోరడం భావ్యం కాదుకదా? మరి ఏమిటి అడగడం?" అని మనస్సులో అనుకోసాగాడు.

చివరికి ఒక ఆలోచన తట్టింది!

భీమావధానులుగారికి ఒకే ఒక స్త్రీ సంతానం! సనాతన ధర్మంప్రకారం ఆ అమ్మాయికి బాల్యంలోనే వివాహం జరిగింది. మరి కొద్దికాలంలోనే వైధవ్యం సంభవించిందా అమ్మాయికి. ఆ అమ్మాయి 'రామా, కృష్ణా,' అని భగవంతుణ్ణి ధ్యానించుకుంటూ పనిపాట్లల్లో తల్లికి సాయం చేస్తూ పుట్టింటిలోనే వుండిపోయింది. ఆ అమ్మాయి అంటే

తండ్రికి ఎక్కువ అభిమానం! 'నాన్నగారూ! మీరు విజయనగరం వెళ్ళినప్పుడు వీలుంటే నాకు బరంపురం నారపోత్తి పంచ ఒకటి తెండి; మడిగా కట్టుకుని కొంతసేపు దైవ ప్రార్థన చేసుకోడానికి వీలుగా వుంటుంది' అని ఒకప్పుడు అన్నదామె. భీమన్న తర్వాత కొన్నిసార్లు విజయనగరం వెళ్ళినా అది కొనడం సాధ్యపడలేదు. ప్రశస్తమైన ఆడకట్టు పోత్తిపంచ కొనడానికి కనీసం పదిహేను రూపాయిలు కావాలి! అంత డబ్బు ఒక్కసారిగా అతని దగ్గర వుండడమూ దుర్లభమైనది! ఇప్పుడు ప్రభువులు "ఏం కావాలి?" అని కోరితే యీ పంచె కావాలని కోరాలి. ఆ మాత్రం కోరిక మహారాజులుంగారు నెరవేర్చకపోరు.

భీమావధానులుగారు వేగంగానే అడుగులు వేస్తూ ప్రయాణం సాగించారు. చింతలవలస మెరకల దగ్గరికి వచ్చే సరికి అర్థరాత్రి అయింది. ఆయన పెద్దరోడ్డునుంచి, అడ్డు రోడ్డు మలుపు తిరిగేసరికి తన వెనుక యిరవై గజాల దూరంలో ఇద్దరు మనుష్యులు వస్తున్నట్లూ, వాళ్లు చెట్ల చాటునుంచి వస్తున్నట్లూ కనిపెట్టాడు. ఆ యిద్దరూ దొంగలై వుంటారని నిశ్చయించి—యింకా తన్ను వెంబడిస్తే తగిన ప్రాయశ్చిత్తం చేద్దామని నిశ్చయించుకుని మెల్లిగా నడవసాగాడు. ఇంతలో వాళ్లూ మలుపుతిరిగి వేగంగా యితనివద్దకు వచ్చారు. ఈ రోడ్డుమీద జనసంచారం వుండదని వాళ్లకు తెలుసు. వాళ్ళిద్దరూ భీమన్నగారిని

నిలువమని చెప్పి, అతని దగ్గిర వున్న దేదో అక్కడ పెట్టి మరీ అడుగు వెయ్యమన్నారు.

భీమన్నకు క్రోపం వచ్చింది. వాళ్లూ తనలాగే బలిష్ఠు లైనా, లక్ష్యం చెయ్యక దుడ్డుకర్రచూపుతూ 'నా దగ్గర వున్నది యిది మాత్రమే! దీన్ని కింద పెట్టడమెందుకూ? మీ మీదే వేస్తాను' అని దాన్ని ఎత్తి పట్టుకున్నాడు.

ఇంతలో ఒకడు తన చేతికర్రతో కొట్టరాగా భీమన్న తనదుడ్డుకర్రతో దాన్ని అడ్డుకొని దెబ్బ తప్పించుకున్నాడు. ఆ కర్ర ఆ దొంగముఖానికే తగిలింది. ఇంతలో రెండవవాడు కర్ర ఎత్తబోగా భీమన్న వాని నడుంమీద గట్టిగా ఒక దెబ్బవేశాడు. దానితో వాడు నేలమీద కూలబడ్డాడు. ఇది చూచి మొదటివాడు పలాయనం చిత్తగించాడు.

దొంగలకు భయపడే స్వభావం కాదు భీమన్నది. ఒకవేళ పెద్ద దెబ్బ తనకి తగిలితే రసాభాస అయి, కార్యం చెడిపోతుందని, మరి వాళ్ళ జోలికి పోక, చరాచరా నడిచి ఒంటిగంటన్నర అయేసరికి కోట చేరుకుని సింహద్వారం ముందు వున్న ఒక మండపంలో ఒక గంట విశ్రాంతి తీసుకున్నాడు. తర్వాత మెల్లిగా లేచి, అయ్యకోనేటివైపు వెళ్లి కాలకృత్యాలు తీర్చుకుని స్నానంచేసి, మూడూ అయేసరికల్లా కోటలోని కందా - వంటసాలలో ప్రవేశించాడు. అక్కడ సిద్ధంగా వున్న సహాయ పాచకులకు ఆ యా పనులు పురమాయిస్తూ సూర్యోదయానికి సమస్త పదార్థాలూ సిద్ధంచేసి

రెండు వేల విస్తళ్లూ, వేయించాడు భీమన్న.

*　　　*　　　*

బ్రాహ్మణ సమారాధన అయాక, మహారాజులుంగారూ ద్వాదశపారణ చేశారు. భీమన్న పాకం నలపాక, భీమపాకాలను మించి వుందని చాలా ప్రశంసించారు.

భోజనం అయాక భీమావధాన్లను పిలిపించి "చాలా సంతోషించాం! మీకేం కావాలో చెప్పండి" అని మహారాజావా రడిగారు.

భీమన్న ముకుళిత హస్తాలతో నిలిచి "ప్రభువుల దయే చాలు. అయినా మా అమ్మాయి విజయనగరం వెళ్ళితే నారికా త్తిపంచ ఒకటి తెమ్మని ఎప్పుడో చెప్పింది. నేటిదాకా ఆ కోరికను నేను నెరవేర్చలేకపోయాను. ప్రభువులు అది దయచేయిస్తే చాలు. మరేమీ అక్కర్లేదు" అని మనవిచేశాడు.

మహారాజులుంగారు నవ్వుతూ దివాను మొగంవైపు చూశారు.

దివాను భీమన్నతో "సరేలెండి! అవధాన్లుగారూ! మీ కోరిక తప్పక నెరవేరుతుంది. ఈ దక్షిణ కూడా గ్రహించాలని ప్రభువులు కోరుతున్నారు" అంటూ నూట పదార్లూ, తాంబూలమూ వెండి పళ్లెంలో పెట్టి, భీమన్నకు సమర్పించి నమస్కరించాడు.

భీమావధాన్లు ఆనందంతో ఆకాశం అందుకున్నాడు.

భీమన్న తెలుపకపోయినా చింతలవలస దగ్గర దొంగలు ఎదిరించగా, వాళ్ళకు బుద్ధి చెప్పినసంగతి దివానుకు తెలిసింది. భీమన్న సాహసానికి ఆయన మెచ్చుకున్నాడు.

తర్వాత భీమన్నగారికి నారపాత్రిపంచ మాత్రమే కాకుండా, ఒక అదుకట్టు పట్టుచీర, ఒక పట్టుపంచలచాపు కూడా బహూకరింపబడ్డాయి.

భీమన్న కోరిక యిన్నాళ్ళకు నెరవేరింది.

---

# 8. ప్రతిఫలం

ఇది రమారమి నూరేళ్ల కిందటి మాట. మిర్జా, మన్నె సుల్తాన్ శ్రీ నారాయణ గజపతి మహారాజులుంగారు తమ తండ్రి విజయరామ గజపతి మహారాజులుంగారి అనంతరం విజయనగర సింహాసనం అధిష్ఠించారు.

పేరుకైతే సంస్థానం లభించిందిగాని ఆర్థికంగా ఏమీ ప్రయోజనం లేకపోయింది. సంస్థానానికి వచ్చే ఆరు లక్షల పైచిల్లర జమాబందీలోనూ ఐదు లక్షల కరుకులు యీస్టిండియా కుంఫిణీ దొరలకి ఫేష్కసు చెల్లించి తీరవలసిందే! తమ కర్చులూ, సంస్థానం ఉద్యోగస్థుల జీతాలూ, బత్తేలూ మిగతా లక్షపైచిల్లరతో సాగవలసిందే!

భూములు పండినా, యెండినా, రైతులు సిస్తులు యిచ్చినా, మానినా ఏమయినా సరే-ఫేష్కసులో మాత్రం వక దమ్మిడీ తగ్గడానికి వీలులేదు.

కుంఫిణీవాళ్లింత కాఠిన్యం వహించడానికిన్నీ కారణం లేకపోలేదు.

నారాయణ గజపతిమహారాజులుంగారి తండ్రి రాజ్యకాలంలో రాజుగారి సవతి అన్నగారే దివాన్గిరీ చెలాయించేవారు. ఆయన స్వార్థపరత్వంతో పాటు సంస్థానంరాబడీ

కొంత పెరిగింది. ఆ రాబడి మసీదులకీ, దేవాలయాలకీ యిచ్చిన మాన్యాలూ, యినాములుగా యిచ్చిన అగ్రహారాలూ సంస్థానంలో కలుపుకోవడంచేత వచ్చిందే!

సీతారామరాజుగారి అంటే-దివానుగారి హయాములో ప్రజలకి సుఖమన్నమాట లేనేలేదు. ఆయన దౌర్జన్యాన్ని అడిదం సూరకవి రామలింగేశ్వర శతకంలో బాగా విశదపరిచి, దానివల్ల వ్యాపించే ఆయన కీర్తిని చిరస్థాయిని చేశాడు.

ఆ మహానుభావుడు సంస్థానాన్ని తానే కాజెయ్యాలని చూసి అందుకని కుట్రలు పన్ని యిదుముళ్ల మాటలు చెప్పి కుంఫిణీవారికీ, మహారాజులుంగారికీ వున్న స్నేహాన్ని చెడగొట్టి వైరం కల్పించి యుద్ధం చేయించి పద్మనాభంలో మహారాజులుంగారు వీరస్వర్గం పొందేటట్టు చేశాడట! విజయనగరానికి తిరిగివస్తూ తానూ చచ్చిపోయేడు దారిలో, యే ప్రతిఫలమూ పొందక.

ఆ యుద్ధం జరగడం అనే కావేషీ మనస్సులో పెట్టుకొనే కుంఫిణీవారు తర్వాత పేష్కసు విషయంలో యిలాంటి బందోబస్తు చేశారు.

యిదీ సంగతి.

పద్మనాభ యుద్ధానికి ముందే రాజకుటుంబంలో కలత పుట్టింది. దానికితోడు యుద్ధం! ఈ సందర్భాల్లో అవకాశం ఉన్నంతవరకూ దగ్గరివాళ్లు రొక్కమూ, జవాహరీ కూడా

స్వాతానికి జాగ్రత్త పడుచుకున్నారు.

ఇక శ్రీ నారాయణబాబుగారి రాచరికం పేరుకు కాక మరేముందీ?

ఇంకో విశేషం. ఆయన తపశ్శాలి; కర్మిష్ఠి; దాన కర్ణుడు; అతను తాను కష్టమనుభవిస్తూన్నా సరే; ఎదటి కష్టంచూచి ఓర్వలేడు. అతని చేతికి యెముక లేదు; ఏనుగు పాడి!

ఈ గుణాలు ప్రశంసార్హాలే; ఆర్థికంగా చూస్తే దుర్భిక్షంలో అధికమాసం!

రైతుల్లో—పలుకుబడికలవాళ్లలో చాలామంది రాజుగారికి దూరబంధువులైన క్షత్రియులు. దివాంజీగారి అన్యాయ ఫలితంగా వాళ్లకి రాజుగారిమీద కాకపోయినా సంస్థానం మీద గుర్రు వుండేది. అంచేత భూములు పండుతున్నా కూడా వారు సిస్తులు చాలావరకూ బకాయి వేశేవారు. దానికితోడు నారాయణబాబుగారి మెత్తదనం చూసి సిస్తులసలే ఎగ్గొట్టేశేవారు.

రాబడి చూస్తే తక్కువ. అదీ బకాయిలకింద వుండిపోయేది. తన మెత్తదనమూ, దివాను అసమర్థతా బకాయిలుండిపోడానికి చేదోడూ వాదోడూ అయాయి! తాము ఖర్చులు తగ్గించుకోవచ్చు; సంస్థానం వుద్యోగస్థులకి జీతాలు బకాయి పెట్టొచ్చు; మరి పేష్కష్ సంగతి? అది యివ్వక తప్పదే! ఎలా యివ్వడం?

మహారాజులుంగారు రెండేళ్లకు పైగా పేష్కసు బాకీపడిపోయారు. కుంఫిణీవాళ్లు తాఖీదులమీద తాఖీదులు పంపుతున్నారు. సంస్థానం ఉద్యోగుల గోల ఎక్కువై పోయింది. దానప్రవణమైన వారి హస్తం అలవాటుకొద్దీ యాచకులవైపు శూన్యంగా ప్రసరించేది. యిలాంటి సందర్భాల్లో వారికి మనస్సు స్థిరంగా నిలిచేదెట్లా? తపస్సు కొనసాగేదెట్లా?

ఆలోచించి ఆలోచించి, ఉపాయాంతరం కానక తగిన సరంజాంతో మహారాజులుంగారు సకుటుంబంగా కాశీకి వలస వెళ్లవలసి వచ్చింది.

అది మనోనిశ్చలతను ప్రసాదించే క్షేత్రం. తపస్సుకి అనుకూలమైంది కూడాను.

కొద్ది రోజుల్లోనే కుంఫిణీవారికి సంస్థానం స్థితిగతులూ, రాజుగారు వలస వెళ్లడానికి కారణం తెలిసింది. (శ్రీ) రాజుగారు సంస్థానం విడిచివేశారనే విచారంకంటే తమ పేష్కసు వసూలు కావడం లేదనే విచారమే వారికెక్కువయింది. అప్పుడే వారు సంస్థానం విషయాల్లో దఖలు పుచ్చుకోవలసి వచ్చింది.

కుంఫిణీవారి ప్రయత్నం వారికి లాభించింది; తర్వాత సంస్థానం అభివృద్ధికి కొంత కారణమూ అయింది.

స్కార్లెట్ దొర కంపెనీ తరఫున గుంటూరు సర్కారులో ఉన్నతోద్యోగి; విజయనగరం వ్యవహారాలు చక్క

బరచడానికి ఆయనే తగినవాడని ఇంగ్లీషువారి అభిప్రాయం.

దొరగారు తనకు విశ్వాసపాత్రుడూ, క్రింద ఉద్యోగస్థుడూ అయిన అప్పయ్య పంతుల్ని విజయనగరం తీసికొచ్చాడు. అత నుంటే తనకు దిగ్విజయం అని ఆయన తలపు.

నిజానికి సంస్థానాన్ని నిలబెట్టింది అప్పయ్యపంతులే!

*   *   *

అప్పయ్యపంతులుగారి యింటి పేరు కస్తూరివారు. ఆయనకి ఆంగ్లంలో అంత పాండిత్యం లేకపోయినా అనుభవమూ, అవసరాలకి తగిన భాషా లేకపోలేదు. కాబట్టే దొరగారి ప్రేమ కాయన పాత్రుడయ్యాడు.

పేరుకి దొరగారికి ఆయన పెర్సనల్ అసిస్టెంటు అయినా అధికారమంతా ఈయనదే.

ఉద్యోగానికి వచ్చిన కొత్తరికంలో అప్పయ్యపంతులు గారికి యేం చెయ్యడానికీ పాలుపోయింది గాదు. ఉద్యోగం కొత్త. ఎవరి స్వభావం యెలాటిదో!

వెంటనే ఆయన తన బంధువుల్లోనూ, స్నేహితుల్లోనూ విశ్వాసపాత్రు లయినవారిని గుంటూరు ప్రాంతాలనుంచి రప్పించి వారికి అమీన్లూ, సముద్దార్లూ మొదలైన పనులు యిప్పించి కట్రదారులయిన పాతవారిని పనిలోంచి తొలగించాడు.

మొదటిపని యిదీ.

యిక రెండోది జమాబందీ వసూలు!

ఆలమండ, దేవిడి, పోలిపిల్లి మొదలైన స్థలాలలో వుండే రైతులు రాజబంధువులు; శూరులు; ముష్కరులు కూడా; సిస్తు వసూలుకి ఆ వైపు వెళ్లిన సముద్దారు తిరిగీ కంట బడడమే అరుదు.

అసలు కొన్నేళ్ళనుంచీ వారికి సిస్తులు చెల్లించే అల వాటే తప్పిపోయింది.

అప్పయ్యపంతులుగారు దొరగారితో ఆలోచించి కంపెనీ రిజర్వు పటాలం మద్దత్తుగా వుంచుకుని ఖుద్దున జమాబందీ కెళ్లారు. అవసరమైతే రెండు, మూడు కాల్పులు కూడా చేయడానికి వతనునుండి కాగితం తెప్పించుకున్నారు.

ఇక నేముందీ? దెబ్బంటే దెయ్యానికీ వెరపే!

అసలా రిజర్వు పటాలం చూసే, ఆలమండవారు భయపడిపోయారు. నిమిషాలమీద జమాబందీ వసూలయింది.

తుపాకుల ఉపయోగమే అక్కర్లేకపోయింది.

తర్వాత రైతులందరికీ పంతులుగారు పంపించిన తాఖీదు యిదీ—

'ఏ గ్రామంవారైనా సిస్తులు చెల్లించడానికి తటపటా యించారంటే వాటిని వసూలు చేయడానికి స్వయంగా మేమే రావలసి వుంటుంది, పటాలంతో కూడాను. పటాలాని కయ్యే భత్యఖర్చులు ఆ గ్రామంవారే భరించవలసి వుంటుంది.'

దాంతో రైతులందరికీ మోతుబరుతనం చల్లారి జమాబందీకి ఒక మార్గం ఏర్పడింది.

అప్పయ్యపంతులుగారంటే అందరికీ గుండెలమీద కుంపటి. కాలాగ్ని రుద్రుడులాటి ఆతని మూర్తిని తలచు కుంటే నవనాళ్లాల్లోంచీ కంపం ఎత్తుతుండేది. పేరుపడిన మోతుబరీ రైతులు లొంగిన తర్వాత పంతులుగారు పటాలాన్ని పంపేశారు.

తర్వాత జవాన్లూ, సముద్దార్లూ పల్లెలంట పన్నులకి తిరిగేవారు. పటాలాన్ని కళ్లారా చూడని కొన్నిచోట్లలో పంతులుగారి భయం వున్నా పెంకెరైతులు సముద్దార్లనీ, తదితరుల్నీ లెక్క చేశేవారు కారు.

పన్నులు ఖచితంగా చెల్లించేవాళ్లు కూడా పంతులు గారి కాళ్లమీద పడి తమ కష్టసుఖాలని తమ తమ ముఠాలకు వచ్చి ఆలోచించవలసిందిగా బ్రతిమాలుకునేవారు. దూరస్థులు మహాజర్లు పంపుకునేవారు.

అంచేత అప్పయ్య పంతులుగారు తగిన సిబ్బందీతో ముఠాలన్నీ తనిఖీచేసి చాలాచోట్ల క్యాంపులు చేసి రైతుల కష్టసుఖాల్ని స్వయంగా తెలుసుకోదలచుకున్నారు.

* * *

కస్తూరి అప్పయ్య పంతులుగారు ఎంత కోపిష్ఠో అంత దయాళువు. ఆయననోరు ఎంత కఠినమో మనస్సంత మెత్తన.

ఆయనలో ప్రసన్నతా వుంది; గాంభీర్యమూ వుంది. ఆయన యెదట పడడానికి అందరికీ భయమే; అయినా ఎదట పడకుండా వుండలేక పోయేవారు. ఆయనలో ఏదో శక్తి

వుండేది.

రైతులతోనూ తదితరులతోనూ ప్రసంగించేటప్పుడూ, తిట్టేటప్పుడూ ఆయన తొమ్మిదో అష్టం పారాయణ చేసినా, కావలసినన్ని భగవత్ స్తోత్రాలు కంఠతా వచ్చు నాయనకి.

ఆయన గొప్ప భగవద్భక్తుడు కూడాను.

కోడి కుయ్యకముందే లేచి స్నానాదికాల్యకృత్యాలు తీర్చుకుని భగవద్గీతా, సుందరకాండలు పారాయణచేసి సంధ్యావందనమూ, జపతపాలూ జరిగించితేగాని కచేరీ గుమ్మం తొక్కేవాడుకా డాయన. ఎంత గొప్పపనివున్నా సరే! ఈలోపున దొరగారు కోరినా దర్శనం దొరకడంసున్న.

క్యాంపులో నున్నా యిదే పద్ధతి.

ఒక క్యాంపులో ఏమిటి! అటు సూర్యుడు యిటు తిరిగినా వారి పద్ధతుల్లో మార్పుండదు.

ఆయన క్యాంపుకి బయల్దేరారంటే మహా అట్ట హాసంతో, అంటే వానమామల స్వాములవారు వందలకొలదీ బలగంతో బయల్దేరినట్లు, వెళ్ళవలసిందే!

ఆయన వెనకాల వెళ్ళేవారికి ఏ విషయంలోనూ లోటూ లేదు.

కావలసినంత సప్లయి! పాలు, పెరుగు, నెయ్యి, పళ్లు, కాయలూ, కూరలూను! సిబ్బందీ కంతకీ రెండుపూటలా పిండి వంటలతో భోజనాలు!

పంతులుగా రంటే గుమస్తాలకి భయమున్నా క్యాంపు

లకి వారి వెనకాల వెళ్లడానికి సంతోషమే!

అధికారమంతా గుమస్తాలదే అప్పుడు! పంతులు గారు రైతులతో భూములమీదికి వెళ్ళితే, పనులు బాగా చెయ్యలేదని వెట్టీలమీదా నౌకర్లమీదా, చాకర్లమీదా అగ్గిరాముళ్ళయ్యే వారు వారు. సప్లయిలు బాగులేవని మున సబుల మీదా, కరణాలమీదా దాపత్తు చెలాయించేవారు.

పై అధికార్లకింద వారు పడేపాట్లు ఆ సమయంలో వారికి జ్ఞాపకానికి వచ్చేవి కావు. రాత్రి మడికట్టుకోవడానికి ఆరవెయ్యాలని జొన్ననలస ముతక గావంచాలు సాయంత్రం ఆరుగంటలప్పుడు వంటబ్రాహ్మణులకి యిచ్చేవారు. 'యిప్పు డారేస్తే ఆరుతాయా అండి?' అని వాళ్ళంటే 'నా గావంచా వక్కటీ యెలాగన్నా కష్టపడి ఆరెయ్యి' అంటూ ఎవరి మట్టుకు వారే చెప్పేవారు అనాలోచితంగా. కాదంటే కోపం వచ్చేదిట! 'వీళ్లకి తగిన శాస్తి యిదే' నంటూ వంట బ్రాహ్మలు ఆ గావంచాలను అలాగే పింజాపెట్టి ఒకళ్ళపీట మీద యింకొకరి గావంచా ఉంచేవారట! ఆలోచన లేని ఆ గుమాస్తాలు తమది ఆరలేనందున మరొకరి గావంచా వంటవారు యిచ్చేరని వారి అభిమానానికి మురిసిపోతూ తడి గుడ్డ కట్టుకొని వచ్చి ఆ మైలపడ్డ గావంచానే ధరించి తమరు మడికట్టుకున్నట్లు భావించేవారట! కాకపోతే ఆ మహాసము ద్రంలో వంటవాళ్ళు ఎన్ని గావంచాలని ఆరెయ్యగలరు?

*　　　*　　　*

అది సబ్బవరం క్యాంపు.

పంతులుగారు పగలల్లా గ్రామాలు తిరిగి అప్పుడే మకాము చేరుకున్నారు. చేరుకున్న వెంటనే సంధ్యావందనం మొదలయినవి ముగించి తిరిగీ కచేరీ చెయ్యడానికి తయారు, ఎంత ఓపికోగాని!

తివాసీమీద ఖాలీసుని ఆనుకుని పంతులుగారు రైతుల్ని పిలిపించి విచారణ చేస్తున్నారు. కచేరీ సావడిలో రెండు పెద్ద ఆముదండీపాలు అఖండంగా వెలుగుతున్నాయి. డస్కులముందు కూర్చుని గుమాస్తాలు చిఠా ఆవర్జాలు తీసుకుని లెక్కలు సరిచూచుకుంటున్నారు.

జవాను పైడితల్లి ఒకరైతును వెంటబెట్టుకు వచ్చాడు. ఆ రైతు పంతులుగార్ని చూసి గడగడ లాడుతూ నమస్కారంచేసి నిలుచున్నాడు.

*                    *                    *

గడ్డినాయుడు సర్కారువారికి రేండేళ్ల సిస్తు బకాయి పడ్డాడు. పంటలు పోవడం, బహు కుటుంబీకుడు కావడం దానికి కారణం.

సర్కారువారికి యీ కారణాలతో పనిలేదు. సిస్తు అణా పైసలతో కక్కవలసిందే! ఆ సంగతి నాయుడికీ తెలియకపోలేదు. తెలిసి మాత్రం ఏం జేయగలడూ? చేతుల్లో దమ్మిడీ అన్నా లేదాయె.

చాలాసార్లు జవాన్లనీ, సముద్దార్లనీ మరిపింతాలు

పెట్టి కాలం గడుపుతున్నా డా పేద రైతు.

పంతులుగారు వస్తున్నారని ముందే తెలిసి పొరుగూళ్లకి పోయి దాగుకున్నాడు; తర్వాత యింట్లోనే వుండి, లేడని చెప్పించాడు.

చిఠా తీయించి పేర్లు చదివించడంలో గడ్డినాయుడి పేరు పంతులుగారి మనుస్సుకు తాకింది. అతగాడు చేస్తున్న పట్టాట కూడా కొంత తెలిసింది.

రెండుమాట్లు స్వయంగా కబురు పంపినా అతని పత్తా లేదు. చివరికి జవానుపై కోపం వచ్చి 'ఈ నాడు ఆసామీని కళ్ళబెట్టకపోతే వుద్యోగానికి బరతరపు' అని కఠినంగా ఆజ్ఞాపించారు. అంచేత జవాను గడ్డినాయుణ్ణి ఊడలాగి తీసుకు రావలసి వచ్చింది.

* * *

గడ్డినాయుణ్ని చూడగానే పంతులుగారు సిస్తును గురించి ప్రశ్నించడం ప్రారంభించారు. తప్పు తనదే కావడం చేత అతనేమీ బదులు చెప్పలేక పోయాడు. 'చిత్తం' అనే మాటతప్ప.

బదులేనా చెప్పక బెల్లంకొట్టిన రాయిలాగ నుంచున్న నాయుణ్ణి చూచినకొద్దీ పంతులు గారికి కోపం యెక్కువవుతూ వచ్చింది. అది యెక్కువయినకొద్దీ ఆయన శరీరం కంపించింది.

తల ఎక్కువగా ఆడిస్తూ ఆయన 'ముండా కొడకా?

మాట్లాడవేంరా? ఎప్పుడిచ్చి యేమస్తావురా?' అని తొమ్మిదో అట్టం పారాయణకి ప్రారంభించాడు. తాను చెప్పవలసిందేదో యిదివరకే అయిపోయిందనుకొని ఊరుకున్నాడు నాయుడు.

నాయుడికి ఆ మాటలమీద దృష్టే లేదు. అస లా మాట లేవీ అతగాడికి వినబడే లేదు. దృష్టితో పాటు అతని యింద్రియాలన్నీ వేరే లక్ష్యంమీద లగ్నమయి ఉన్నాయి.

అయిదు నిమిషా లయింది.

పంతులుగారి ధోరణి ఉద్రేకిస్తూన్నది గాని తగ్గలేదు. నాయుడి కా సంగతే తెలీదు.

ఏం తోచిందో యేమిటో ఉండి వుండి వొక్కమా రతగాడు పకాలున నవ్వాడు.

పంతులుగారే కాదు; చుట్టుపట్ల నున్న అందరూ ఆశ్చర్యపోయారు.

నవ్వేక తెలిసింది నాయుడికిన్నీ తాను యేడ్వవలసిన స్థితిలో వున్నాడు గాని, నవ్వవలసిన స్థితిలో లేడని.

మరి నవ్వేటప్పుడీ జ్ఞానం వుంటేనా?

జపం విడిచి లొట్టల్లో పడ్డట్టు పంతులుగారు అసలు సంగతి వదిలి నవ్వడానికి కారణం యేమని నాయుణ్ని నిలవ దీశారు.

నాయుడు వడుకుతూ 'కొద్దిరోజుల్లో జతపరచి పూర్తిగా చెల్లిస్తాను మహాప్రభూ! రక్షించాలి' అంటూ మొదటిదానికి జబాబు ప్రారంభించాడు.

'ఆ సంగతి అలా వుండనీ! మొదట నువ్వెందుకు నవ్వావో చెప్పు!' అని అన్నారాయన.

గడ్డినాయుడికి చెప్పక తప్పింది కాదు.

'మహా ప్రెభూ! చమించాల! యేలినవారికే కాకుండా తమ తలమీద వున్న పిలక్కికూడా నామీద కోపం వచ్చి నావేపు వుడుకుతూ నన్ను జడిపిస్తూ వున్నాదే అని నాకు నవ్వొచ్చింది ప్రెభూ!' అన్నాడు.

నాయుడన్నమాట నిజమే. దీపం నీడలో గోడమీద పడ్డ పంతులుగారి ప్రతిబింబంలో మీదికి నిక్కివున్న ఆయన పువ్వొత్తి పిలక, తల ఆడిస్తూ వున్నప్పుడు నాయుడుమీదికి వురికేటట్టే వుండేది.

తన నీడ చూసుకున్నారు పంతులుగారు. నడి నెత్తి మీది పిలక నాయుడితో యుద్ధానికి సిద్ధంగా వున్నట్టు కనపడింది. ఆయన కంతా అవగతమైంది.

కోపం అంతా యెక్కడికి పోయిందో ఆయనా నవ్వారు పకాలు మంటూను.

నాయుడి అమాయికత్వానికీ, తెలివి తక్కువతనానికీ ఆయన కెంతో ఆనందం కలిగింది. ఎక్కడలేని అభిమానమూ కలిగింది నాయుడి మీద.

సంతోషంతో ఆయన 'నీ బకాయి రద్దుచేశాను. ఆ రెండేళ్ళ కిస్తులూ నువ్వు చెల్లించ నక్కర్లేదు' అని వరం అనుగ్రహించేరు! ఆయన సర్వ స్వతంత్రులు!!

నాయుడు ఆనందంతో ఆకాశం అందుకున్నాడు.

'ఎంత అదృష్టమో యీ గడ్డినాయుడికి!' అంటూ తక్కిన రైతులు అసూయపడ్డారు.

---

# 9. శృంగభంగం

ఇది డెబ్భైఅయిదేళ్ల క్రిందటిమాట. అభినవాంధ్ర భోజుడని భారతదేశంలోనే కాకుండా ప్రపంచం అంతటా గొప్ప ఖ్యాతిని గడించిన ఆనందగజపతి ప్రభుని తండ్రి శ్రీ విజయ రామ గజపతి మహారాజులుం గారు విజయనగరం సంస్థానాన్ని పరిపాలిస్తున్న రోజులవి!

ఆనందగజపతి ప్రభువు ఎంతటి విద్వాంసుడూ, విద్యా వ్యసనం కలవాడూ అయి వుండేవాడో, ఆయన తండ్రిగారు అంత బలపక్షపాతులు! మహా బలశాలులు!!

దేశంలో ఎక్కడైనా మహా బలవంతు లున్నారని తెలిసేసరికి, వారిని రప్పించి తమ ఆస్థానంలో వుంచి పోషించేవారు. అలాంటివారిని కొందరిని పోగుచేసి, గరిడీ లను స్థాపించి, ఆ వస్తాదుల మూలంగా చాలా మంది యువ కులను బలశాలులుగా తయారు చేయించేవారు. ఆయన తాను స్వయంగా బలప్రదర్శనా లివ్వడానికి కుతూహల పడుతూ ఉండేవారు; కాని అమ్మాజీ సర్కారు మొదలైన పెద్దలు అలా చెయ్యకూడదంటూ గట్టిగా చెప్పడంవల్ల ఆ ప్రయత్నం మానుకునేవారు!

కాని ఆయనకు ఉబలాటం మాత్రం ఉండనే ఉంది.

ఒకనాటి సాయంకాలం ఆయన ఇద్దరు అనుచరులతో కూడా బంతుల మేడవైపు వాహ్యాళికి బయలుదేరి వెళ్ళారు. రైలురోడ్డు ప్రక్కవున్న రోడ్డుమీదకు వచ్చేవేళకు మెయిలు బండి అతి వేగంతో వస్తూవుండడం కనిపించింది. అప్పుడు ఆ రైలుతో సమానంగా గుర్రాన్ని పరుగెత్తించాలని అయనకు కోరిక కలిగింది. కోరికే కాదు. పట్టుదల కూడా కలిగింది. ఆ పట్టుదలతో మూడుమైళ్ళ దూరం గుర్రాన్ని రైలుతో సమానంగా పరిగెత్తించారట! ఆయన అనుయాయులు మిక్కిలి ఆశ్చర్యపోయారు. ఈ వార్త కోటలో తెలిసిన తర్వాత ఆయనను సాధారణంగా స్వారీకి బయటికి పోనిచ్చేవారు కారట.

స్వయంగా బల ప్రదర్శనం చెయ్యడానికి వీలు లేక పోయినా—ఇతరుల బలప్రదర్శనాలు ఏర్పాటు చెయ్యడానికాని, ప్రతి నిత్యమూ తాను అభ్యాసం చేసుకోడానికాని ఆయనకు యెలాటి అభ్యంతరమూ ఉండేది కాదు.

*　　　*　　　*

మహారాజులుం గారికి అభిమానం ఉండడంవల్లా, ఆయన తగిన ప్రోత్సాహం యివ్వడంవల్లా భారతదేశంలో వుండిన పైల్వానులందరూ విజయనగరం తప్పకుండా రావడమూ, వచ్చేక బలప్రదర్శనం యివ్వడమూ, ఇచ్చి బహుమానాలు పొందడమూ జరుగుతూ వుండేది.

నగరంలోని ప్రజల్లో దేహ పరిశ్రమను గురించి

ఉత్సాహము అతిశయించింది. చాలా గరిడీలు బయలు దేరాయి. మహారాజులుంగారు "భేష్" అంటేనే చాలును! అదే గొప్ప యోగ్యతాపత్రం. ఆ మాట చెప్పకునే విద్యను ప్రదర్శించి జీవనం గడపవచ్చును.

ఒకప్పుడు ఏమి జరిగిందంటే—ఒక గొప్ప వస్తాదు విజయనగరానికి వచ్చాడు. అతను హిందూదేశం అంతా తిరిగి చాలాచోట్ల బంగారు పతకాలూ, అనీ బహుమానం పొంది జగదేక వీరుడని పేరుపొందాడు.

అతను విజయరామ గజపతి ప్రభుని పేరు బాగా విన్నాడు; కాని తనకు ఆయన తులతూగలేడనే అహంభావం కూడా ఎక్కువ వుందతనికి.

విజయనగరం వచ్చి విజయం పొందాలనే అభిలాష వుండడంచేతనే అతను వచ్చాడు.

వచ్చి మహారాజులుంగారిని దర్శించి, తన బలప్రదర్శనానికి అవకాశం కల్పించాలనీ, అలా జరిగితే తాను ప్రజలనందర్నీ ముగ్ధులను చేసివేయగలననీ, తనకు 'జగదేక వీరుడు' అనే బిరుదం వున్నదనీ, ఎవ్వరూ కూడా తనకు ఎదురుగా నిలిచి గెలవలేరనీ ఉపన్యసించాడు. అతనిలో గర్వం కరుడు కట్టి వున్నట్లు మహారాజులుంగారికి తోచింది.

ఆయనకు ఆ వస్తాదుమీద హేయభావమూ, కోపమూ కూడా ఒక్కసారే కలిగాయి. ఆ వస్తాదుకు ఎదురు నిలిచి, ఓడించాలనే వుబలాటం ఒక్కసారిగా పొంగినట్లయింది. కాని

తన నియమాన్ని జ్ఞప్తికి తెచ్చుకుని కోపాన్ని లోలోపలనే మింగివేసి, "అలాగా అండి! మంచిదే! ప్రదర్శనానికి ఏర్పాటు చేయిస్తాం" అని బయటికి పలికినా, ఈ వస్తాదుకు ఎలాగన్నా పరాభవం కలిగించాలనే కుతూహలం ఎక్కువగా కనబడింది. ఈ సంగతి దివాను జగన్నాథరాజుగారు కనిపెట్టక పోలేదు.

*　　　*　　　*

ప్రదర్శనం ప్రారంభమైనది.

వస్తాదు వివిధ పద్ధతులలో తన బలాన్ని ప్రదర్శిస్తూ ప్రజానీకాన్ని ఆశ్చర్యంలో ముంచివేశాడు. స్థానికులైన పైల్వానులు కొందరు అతనికి పోటీగా నిలిచారు; కానీ - చివరకు అతన్ని గెలవలేకపోయ్యారు.

చివరకు వస్తాదు విజయగర్వంతో "నేను మనభారత దేశం అంతటా తిరుగుతూ వస్తున్నాను. ఇంతవరకూ ఎవ్వరూ నన్ను ఓడించలేదు. ఇకమీదట కూడా నేను అజేయుడనుగానే కాలం వెళ్ళబుచ్చుగలనని అనుకుంటు న్నాను. ప్రభువులవారు నాకు ఈ విషయంలో యోగ్యతా పత్రం యిప్పిస్తే అదే పదివేలుగా సంతోషిస్తాను" అన్నాడు.

మహారాజులుంగారి ముఖం ప్రసన్నంగానే కనబడింది. కాని ఏదో గాంభీర్యం తొణికిసలాడుతూ వుంది. ఆయన ఒక్కసారి దివానువైపు చూశాడు. ప్రభువుల భావాలు ఆ దివానుకే తెలియాలి. దివానులేచి—"ప్రభువుల వారు ఈ మహావీరుని బలప్రదర్శనానికి చాలా సంతోషించారు.

యోగ్యతాపత్రం ఎలా వుండవలసినదీ ఆలోచించి వ్రాయించి ఒకటి, రెండు రోజుల్లో అనుగ్రహించగలరు. ఇప్పుడు వీరి యోగ్యతకు తగినట్లుగా సువర్ణపతకాన్ని బహూకరిస్తున్నారు'' అని తన అంగరఖా జేబులోంచి ఒక బంగారు పతకాన్ని తీసి, ప్రభువుల ఎదట ఉంచారు. ప్రభువులు స్వయంగా దాన్ని బహూకరింపగా—వస్తాదు వినయ, విధేయతలతో దాన్ని గ్రహించాడు.

*　　　　*　　　　*

ఫైల్వాను ఉత్తర హిందూస్థాన నివాసి; ఒక ఉత్తమ క్షత్రియుడు.

అతని గౌరవంకోసం మహారాజులుంగారు తమ భవనంలో ఒక విందు ఏర్పాటుచేశారు. దానికి రాజబంధువులందరూ ఆహూతులయినారు. అతిథికి ఉత్తర హిందూదేశపు భోజనం ఇష్టమో, తెలుగుదేశపు భోజనం యిష్టమో దివాను వాకబుచేసి కనుక్కొన్నాడు. అతనికి యేదైనా యిష్టమే అనీ, రెండింటికీ అలవాటు పడ్డాడనీ, మహారాజులుంగారివలెనే అతనూ శాకాహార ప్రియుడనీ తెలిసింది.

దివాను ఏర్పాట్లు పూర్తి చేయించాడు. భోజన సమయంలో మహారాజులుంగారి ఎడమప్రక్క ఆ వస్తాదుకు ఆసనం ఏర్పాటు చేయబడింది.

రకరకాలైన పిండివంటలతోనూ, ఆంధ్రులకు అభిమానపాత్రాలైన ఆవకాయలూ, పులుసుకూరలూ, పచ్చళ్లు

మొదలైన వాటితోనూ భోజనపాత్రాలు నిండి వున్నాయి.

మహారాజులుంగారు వచ్చి కూర్చున్న తర్వాత— అందరూ పరిషేచనం చేసి భోజనానికి ఉపక్రమించారు.

"మేము పులుసుకూరలూ, ముద్దకూరలూ, ఆవకాయలూ వాడుతూ ఉంటాము. ఇలాటివి నేస్తంగారికి రుచించ వనుకుంటాను" అన్నారు మహారాజులుంగారు.

"బాగానే రుచిస్తాయి. నేను రెండు నెలలకు పైగా మీ గంజాం, విశాఖపట్నం జిల్లాల్లోనే సంచారం చేస్తూవుండడంవల్ల — తెలుగు దేశపు భోజనం కూడా బాగానే అలవాటయింది" అన్నాడు వస్తాదు.

భోజనం సాగుతూనే వుంది.

వంటవాడు రెండు వెండిగిన్నెలతో-స్వచ్ఛమైననువ్వులపప్పు తెచ్చి మహారాజులుంగారి దగ్గరా, వస్తాదు దగ్గరా చేరి ఒక గిన్నె ఉంచి వెళ్ళిపోయ్యాడు.

పులుసుకూర వంతు వచ్చినది.

మహారాజులుంగారు కుడిచేతిలో కొంత నువ్వులపప్పు పోసుకుని పిండగా— మంచినూనె ధారకట్టి అన్నం మీద పడ్డది. ఆయన కూర కలుపుకుని తినసాగాడు.

వస్తాదు కూర కలుపుకోడానికి అన్నం కొంత తీసుకుని నూనెకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

అప్పుడు మహారాజులుంగారు "ఏమిటి, అలా ఊరికే కూర్చున్నారు? నూనె వేసుకుని కూర కలుపుకోండి" అన్నారు.

నూనె వెయ్యలేదంటూ ఇటూ, అటూ చూస్తూ సూచించాడు వస్తాదు.

మహారాజులుంగారు చిరునవ్వు నవ్వుతూ "మీరు స్వయంగా నూనె తయారు చేసుకుంటారనే మా పాచకుడు నువ్వులపప్పు తెచ్చి యిచ్చాడు. బలశాలుర దగ్గర అలా వుంచ డమే అతనికి పరిపాటి. నాకు నూనె కావలసినా అదే పద్ధతి" అన్నారు.

"అదా సంగతి?" అంటూ వస్తాదు కొంత పప్పును కుడిచేతిలో వేసుకుని పిండడం ప్రారంభించాడు. కాని ఒక్క చుక్కయినా నూనె రావడం లేదు.

మహారాజులుంగారు అది చూచి "అయ్యో! మీకు యీ పద్ధతి అలవాటులేదు కాబోలు. అయినా ఫర్వాలేదు లెండి" అంటూ తన ఎడమచేత్తో అతని కుడిచేతి పిడికిలిని గట్టిగా నొక్కారు. నొక్కీ నొక్కడంతోనే వస్తాదు పిడి కిటిలోనుంచి నూనెధార కారసాగింది.

వస్తాదు అర చెయ్యి బాగా రక్తం చిమ్మినది. ఇది చూసి అతను నిర్ఘాంతపోయాడు.

అతిథు లందరూ ఆశ్చర్యంతో చూడసాగారు.

వస్తాదు తల వంచుకుని "ప్రభూ! నాకు బాగా శృంగ భంగం అయింది. నా అజ్ఞతకు క్షమించాలి" అన్నాడు.

---

# 10. రామయ్యమ్మ బండి

రామయ్యమ్మగారు విజయనగరం సంస్థాన ప్రభువుల కుటుంబాల్లో ఒకదానికి చెందిన వ్యక్తి. ఇలాంటి రాజబంధువులు సంస్థాన ప్రభువులకు చాలమంది వున్నారు. వారి వారి తాహతులనుబట్టీ, సంబంధ బాంధవ్యాలనుబట్టీ వీరి పోషణకయ్యే ఖర్చులను సంస్థానమే భరించడం కద్దు. కొందరికి నెల నెలకూ సరిపడిన సామగ్రీ అవీ లభిస్తాయి. మరికొందరికి సామగ్రులతోపాటు కొంత భరణం ముడుతూ వుంటుంది. కొందరికి రకరకాల వాహన సౌకర్యాలూ ఏర్పరచబడుతవి. వాటిలో కారు మొదలుకొని రెండెడ్లబండీ దాకా ఉన్నాయి. కారు ప్రభువుల సోదర, సోదరీమణులకే లభిస్తుంది. దగ్గర బంధువులందరికీ గుర్రపు బగ్గీలు ప్రత్యేకింపబడతాయి. దూరపు బంధువులకీ వాళ్ళకీ ఒంటెద్దుబళ్ళూ రెండెడ్లబళ్ళూ ఇవ్వబడతాయి. కాని కోటలో నివసిస్తూ వున్న వాళ్ళందరికీ ఒంటెద్దుబళ్ళు, మినహాగా రెండెడ్లబళ్ళు లేవు. నగరంలో కాకుండా పల్లెటూళ్ళల్లో ఉన్నవాళ్ళకే రెండెడ్లబళ్లు ప్రత్యేకంగా వుంటాయి. నగరంలో వుండేవాళ్లు కొంత నాగరికత కలవాళ్ళు కాబట్టి—వారికి రెండెడ్లబళ్ళు వుంచబడడం లేదు.

విజయనగరం ధర్మసంస్థానాలలో ప్రధానమైనది. రాజకుటుంబంతో సంబంధం వున్న వాళ్ళకే కాకుండా అనాథ

లయినవాళ్లలో చాలామందికి వాళ్ల జీవనానికి సరిపడే సంభార వస్తువులు నెల కొకసారి ఇయ్యబడుతూ వుండేవి. ఈ విధంగా ఇరవై యేళ్ల కిందటివరకూ అవిచ్ఛిన్నంగా జరుగుతూ వుండేది. అలాంటప్పుడు రాజబంధువులకు సదుపాయాలు జరగడంలో లోపం ఏమిటి వుంటుంది గనుక ?

రాజబంధువులలో ముఖ్యులైనవారికి నెలనెలకీ కొంత డబ్బూ, నెలకు సరిపడ్డ వస్తువులూ, పాలు పెరుగులకోసం ఆవులూ ఇయ్యబడతాయి. పనిపాటులు చెయ్యడానికీ, గోసంరక్షణానికీ దాస దాసీజనం వుండనే వుంటుంది. ఆ పని చేసేవాళ్ల జీత, భత్యాలకూ, పశువులకు కావలసిన గ్రాసానికీ అయ్యే ఖర్చులు సంస్థానాధిపతులే భరించేవారు. ఈ విధంగా రాజబంధువులూ, వారి ఆదరాభిమానాలకు పాత్రులయినవారూ సంస్థానద్రవ్యాన్ని నిరాటంకంగా వినియోగిస్తూ సుఖజీవనం సాగించేవారు. అలాంటివారిలో రామయ్యమ్మగా రొకరు.

రామయ్యమ్మగారు రాజకుటుంబంలో ముఖ్యురాలైన కొండయ్యమ్మగారికి వ్రేలు విడిచిన మేనత్తకూతురు. ఆ కొండయ్యమ్మగారి సిఫారసువల్లనే రామయ్యమ్మగారికి కోటలోనే కందా సమీపంలో ఒక గది బసకు దొరికింది. నెలకు సరిపడ్డ సామగ్రులూ, ఒక ఆవూ, ఎక్కడికయినా వెళ్ళడానికి ఒక ముసలి యెద్దు బండీ—ఇవన్నీ లభించాయి. ఆమె అడపా, దడపా ఎక్కడికయినా వెళ్ళాలని తలిస్తే సరి! ఆబండీ

ప్రత్యక్షమయి ఆమెకోరిక నెరవేరుస్తుంది.

రామయ్యమ్మగారి ఒంటెద్దుబండి చాల విచిత్రమైనది. అది చాలా బరువైన దగుటచేత బండీ నడుస్తూవున్నప్పుడు చక్రం రేకులు ఎంత నిదానంగా కిందికీ, మీదికీ తిరుగుతున్నదీ స్పష్టంగా తెలుస్తూవుంటుంది. రథచోదకుడు లంక పొగాకు స్వయంగా చుట్ట చుట్టుకొని, పళ్ళమధ్య బిగించి, గుప్పు గుప్పున పొగలు వదులుతూ, ఆ ఆనందపారవశ్యంచేత మైమరచి నొగలమీద చేరబడి కునుకుతూ వుంటే, వాహనాన్ని లాగుతూవున్న వృషభరాజం స్వేచ్ఛగా చీమనడకలు నడుస్తూ వుండడం పరిపాటి. ఇలాంటి వాహనాన్ని అధిరోహించి రామయ్యమ్మగారు ఎక్కడికైనా వెళ్ళదలిస్తే, అనుకున్న సమయానికి వెళ్ళలేక పోవడమూ, తన్మూలంగా చూడదలచిన ఆసామీ అక్కడ లేకపోవడమూ, అంచేత ఆమె మిక్కిలీ నిరుత్సాహపడడమూ, బండీనీ, చోదకునీ, పది తిట్లు, తన్నూ తిట్టుకోవడమూ జరుగుతూ వుండేది. ఈ విధంగా బండీ మూలంగా రామయ్యమ్మగారికీ, రామయ్యమ్మగారి మూలాన బండికీ ప్రసిద్ధి వచ్చినది. విజయనగరం అంతటా 'రామయ్యమ్మగారి బండీ' అనే సామెత ఆబాలగోపాలమూ వాడుకలోకి వచ్చింది.

రామయ్యమ్మగారి బండీ విషయంలో మరొక విశేషం వుంది. అది ఏమిటంటే—బండి ఎక్కడికైనా వెళ్ళి, తిరిగి యింటిముఖం పట్టినదంటే మామూలు ఒంటెద్దు బండ్లలాగే

చురుకుగా నడక సాగిస్తుంది. అందువల్ల—రామయ్యమ్మగారికి ఒక్కొక్కప్పుడు చాలా చికాకు కలిగినా, ఒకప్పుడు 'మన బండీ ఫరవాలేదు' అనిపించేది. ఒక్కొక్కప్పుడు తన బండీ మార్చివెయ్యాలని మహారాజులుంగారికి ధరఖాస్తుపెట్టుకొన దలచినా 'ఎందుకులే; ఏదో దీనితోటే కాలం గడిపితే తీరిపోతుంది' అనే ఆలోచన వెంటనే కలిగేది. ఒకవేళ మహారాజులుంగారికి మనవి చేసుకున్నా ఆయనా మార్చకపోవచ్చు. ఆ బండీని ఎవరికో ఒకరికి అంటగట్టక తప్పదు. అలాంటప్పుడు పనీ, పాటూ లేని రామయ్యమ్మగారే దాన్ని ఉపయోగించుకోవడం మంచిదని ఆయన తలచవచ్చును. ఆ బండీసంగతి కర్ణాకర్ణిగా ఆయనకూ ఇదివరకు బాగా తెలుసు. అది ఆయనకు వినోదకరమే! ఈ విధంగా—అన్ని విధాలా రామయ్యమ్మగారి బండి ఆమెకే దఖలుపడిపోయింది.

* * *

ఆ నాడు విజయదశమి.

మన దేశంలో అందరికీ ఇది ముఖ్యమైన పండుగు. పూర్వకాలంలో రాజులు శత్రురాజులమీదికి జైత్రయాత్రకు యీ విజయదశమినాడే బయలుదేరి వెళ్ళి విజయాన్ని సాధించుకుని వచ్చేవారు. బయలుదేరే ముందు దర్బారు జరిపి, సేనానులకూ, వీర భటులకూ, తదితరులకూ తగిన బహుమానా లిచ్చి ప్రోత్సాహం కలిగించేవారు.

పూర్వకాలంలోవలె యిప్పుడు మహారాజులు యుద్ధా

లకు బయలుదేరకపోయినా విజయదశమిరోజున తక్తుమీద కూర్చొని దర్బారు జరపడమూ, పండిత కవులకూ, తదితర కళారాధకులకూ సన్మానాలు జరిగించడమూ, ఏనుగు మీద హావుదా వేయించి, బంధు మిత్రులతోనూ, పరివారం తోనూ ఊరేగడమూ జరుగుతూ వుంటుంది. ఈ పద్ధతి విజయనగరం సంస్థానంలో ఆదినుంచీ వస్తూవున్న సంప్రదాయం కూడాను.

ఈ సంవత్సరం ఊరేగింపు చాలా వైభవంగా జరిపించాలని ప్రభువువారికి కోరిక కలిగింది. రాజ బంధువులందరూ కూడా తమ తమ వాహనాల నధిరోహించి ఊరేగింపులో పాల్గొనాలని హుకుం జారీ చేయబడింది. అంతఃపురంలో ఉత్సాహం ఇనుమడించింది.

అందరూ వుత్సాహంతో సిద్ధపడుతూ వుంటే రామయ్యమ్మగారికీ కోరిక కలిగింది, తానూ నలుగురితో పాటు వూరేగాలని.

వెంకయ్యమ్మ—అయితే, రామయ్యమ్మగారూ ఉత్సవానికి వస్తారనుకుంటాను!

రత్తయ్యమ్మ—ఆమెగారు రాకపోతే ఎలాగ? కొండయ్యమ్మగారి వదినగారై వుండి కూడా రాకపోతే నలుగురూ ఏమనుకుంటారు మరి?

వెంక—అది కాదండీ నేననేది! ఆమె బండీ మెల్లగా నడుస్తుందిగదా, మన అందరితోటీ కలుసుకొని రాగలదా

అని! కాదూ, పోదూ అంటే కొండయ్యమ్మగారి వాహనం మీదే రావచ్చు!

రామయ్యమ్మ చాలా తీవ్రంగా ఆలోచించసాగింది!

ర త్త—వీళ్ళ బండిమీదా, వాళ్ళ బండిమీదా రావలసిన ఖర్మం ఆమెకేమండీ? స్వంతవాహనం వుండగా. రామయ్యమ్మగారి బండీకిగాని, ఎద్దుకుగాని ఏమీ లోటు లేదు. కాస్త ఆహారం సరిగ్గా పడవేస్తే ఆ ఎద్దు గుర్రంకన్న జోరుగా దౌడు తీస్తుంది. బసకు వచ్చేటప్పుడు అది ఎంత వుత్సాహంగా, వేగంగా పరుగెత్తుతుందో మీరు గమనించలేదు కాబోలు!

ప్రక్కనున్న రామయ్యమ్మ మనస్సులో అనుకున్నది 'నిజమే! మా బండీకీ, ఎద్దుకూ లోపం ఏమిటి? రామిగాడు దాన్ని తగినట్టు సంరక్షిస్తే వేగంగా పరుగెత్తేదే! లేకపోతే ఇంటిముఖం పట్టినపుడు వేగంగా ఎలా రాగలుగుతూంది?' అని.

తర్వాత రామయ్యమ్మ రథ చోదకుడు రామిగాడిని పిలిపించి నాటి ఊరేగింపు టుత్సవంలో—ఒంటెద్దు బండ్లు అన్నిటిలో తన బండీయే మొదటగా వుండేటట్లూ, తక్కిన వాటికంటే కొంత త్వరగా నడిచేటట్టూ చెయ్యాలనీ, ఎద్దుకు మంచి మేతా, కుడితీ పెట్టే తీసుకురావాలనీ ఆజ్ఞాపించింది. వాడు 'తాగడానికి పావలా డబ్బులు పారవేస్తే అద్భుతంగా బండీ నడిచేటట్టు చూస్తా'నని సూచించగా—విధిలేక ఆ

డబ్బులు సమర్పించుకుని, ఒక గంట ముందుగానే అంతా సిద్ధంగా వుంచేటట్టు ఏర్పాటు చేసినది.

*      *      *

సాయంత్రం నాలుగు కావస్తూంది. ఊరేగింపునకు సర్వమూ సిద్ధంగా వుంది. చక్కగా అలంకరించబడ్డ పట్టపు ఏనుగుమీద బంగారు మలాము గల హావుదా అమర్చబడి మోతీమహలువద్ద నిల్పబడి వుంది. దానికి ముందు నల్లటి గుర్రాలమీద ఎర్రని దుస్తులు, పచ్చ తలపాగాలూ ధరించి వున్న తురుపుసవార్లూ, వారికి వెనుక బ్యాండు మేళమూ నిలిచి వుంది. గజరాజానికి వెనుక మోటారులూ, వాని వెనుక గుర్రపు బగ్గీలూ, తర్వాత ఒంటెద్దుబండ్లూ ఒకదాని వెనుక ఒకటి వరసగా నిలిచి, ప్రభువుగారి రాకకోసం నిరీక్షిస్తూ వున్నవి. ఆయన వచ్చి, హావుదాలో ఆసీనులు కాగానే ఊరేగింపు ప్రారంభం కావలసి వుంది.

రామయ్యమ్మ కోరిక ప్రకారం ఒంటెద్దు బండ్లలో ఆమెదే మొదట నిలిచి వుంది.

రామయ్యమ్మ కొత్త మల్లుపంచె కట్టుకుని వుంది. బండీలో కొబ్బరిపీచు పరుపు పరిపించి, దానిమీద కొత్త జంబుకానా వేయించి, ఆమె ఆసీనురాలై వున్నది. రథచోదకుడు రామయ్య కొత్త జొన్నవలస గావంచా కట్టుకొని ఎర్ర సిల్కువాణీ తలపాగా చుట్టుకొని పొడుగాటి చుట్ట నోటిలో బిగించి బండీ నడపడానికి సిద్ధంగా వున్నాడు. ఒంటెద్దు

బండ్లు అన్నిటిలోనూ రామయ్యమ్మగారి బండీయే అందరి దృష్టులను ఆకర్షించి వుంది.

మహారాజులుంగారు వచ్చారు. మావటీడు ఏనుగును కూర్చోపెట్టగా, ఆయన హౌదాలో కూర్చున్నారు. ఆయన కూర్చోపీ కూర్చోడంతోనే కోట గోపురంమీద నగారా, ఢంకా నౌబత్తులూ, పట్టపేనుగు ముందు బ్యాండు మేళమూ మ్రోగాయి.

ఊరేగింపు మెల్లగా సాగింది. కోట సింహద్వారం నుంచి బయలుదేరి కోటచుట్టూ తిరిగి రావడానికి రమారమి రెండుగంటల కాలం పడుతుంది. రమారమి మైలున్నర ప్రయాణం చెయ్యవలసి వుంది. క్రమం తప్పకుండా తురుపు సవార్లూ, తర్వాత భజంత్రీమేళం, తర్వాత నడకతో కొందరు ఉద్యోగస్తులూ, తర్వాత పట్టపు ఏనుగూ, దానివెనుక కార్లూ, ఆ మీద గుర్రపు బగ్గీలూ, తర్వాత ఒంటెద్దు బండ్లూ బయలుదేరాయి. రామయ్యమ్మ బండీ వరకూ వరసా సరిగానే వుండింది. కాని ఆబండీ మామూలు ప్రకారమే వెనకపడింది. వృషభానికి దాణా ఎక్కువ పెట్టినా, రామయ్యకు తాగడానికి డబ్బులు ఇచ్చినా ఆ బండీ యథాప్రకారం రామయ్యమ్మగారిబండీలాగే ఉండిపోయింది. తక్కిన బండ్లు దాన్ని తప్పించుకొని ముందుకు సాగిపోయినాయి. రామయ్యమ్మ ఎంత ప్రోత్సహించినా, చోదకుడు ఎద్దు ప్రక్కల్లో ములుకర్రతో ఎంత పొడిచి తోలినా ఎద్దు కాళ్లు

కదల్చడమే కనబడుతుంది కాని, బండీ జరుగుతున్న జాడ కనబడలేదు. ఆమెకు చాలా విసుగెత్తింది.

"ఏమిరా రామిగా! నీకు యెంత చెప్పినా లాభం లేకపోయింది. పావలా డబ్బులు తీసుకున్నావు; బండీ నడిచే జాడ లేదు, అన్ని బళ్ళకీ ముందున్న మన బండీ వెనకపడి పోవడమే కాకుండా ఆ బండ్లన్నీ చాలా ముందుకు సాగిపోయాయి. నలుగురూ నవ్వేటట్లు చేస్తున్నావు నువ్వు" అన్నది రామయ్యమ్మ.

"లేదమ్మా! చూస్తున్నారు గదూ, యెద్దును కుళ్ళ పొడుస్తున్నాను గదా! అది కదలకపోతే మనం ఏంచేస్తాం! అయినా వూరుకోను. మనబండీ దేవిడీ ద్వారందగ్గర తప్ప కుండా వాటిని కలుసుకుని తీరుతుంది" అన్నాడు రామయ్య ధైర్యంగా.

"ఏదో, అదీ చూస్తాంగదూ!" అన్నది ఆమె.

బండీ మెల్లిగా సాగింది. అది యెంతసేపు నడిచిందో తెలియడం లేదు. కాని కోట ద్వారందగ్గరకు వచ్చేసరికి ఊరేగింపులో కలుసుకుంది. అయితే ఊరేగింపు యెదురు ముఖం అయింది. అందువల్ల రామయ్యమ్మబండీ ప్రక్కగా వుండి అన్నిటికీ దారి యివ్వవలసి వచ్చింది. అన్ని వాహనాలూ వెళ్ళిన తర్వాత దాని వెనుక యీబండికూడా తిరుగు ముఖం అయింది. ఒంటెద్దు బండ్లలో మొదటగా బయలు దేరిన యీ బండీ తిరుగుముఖంలో అన్నిటి వెనకా ఉండ

వలసి వచ్చింది. ఊరేగింపు అంతా పూర్తిఅయి, అన్ని వాహనాలు కోటలో ప్రవేశించే సమయానికి రామయ్యమ్మ బండీ కోట గుమ్మం వద్దకు రాగలిగిందన్నమాట!

రామిగాడు తాను అన్నమాట ప్రకారం కోట సింహద్వారం దగ్గర తన బండీ ఊరేగింపుతో కలుసుకునేటట్టు చెయ్యగలిగాడు!

రామయ్యమ్మ ముఖం అటుకుగింజలా అయిపోయింది. ఆమె చాలా చిన్నబుచ్చుకుంది.

---



Printed at Swathanthra Press, Madras—2.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA107B152 |
| పుస్తకం పేరు | గజ పేటల నాటి గాథలు |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 105 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ch. Ramya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |